

ఆంధ్రభారతీ గ్రంథాలయము, బరంపురం,

2వ ప్రచురణము.

# రుక్మిణీపరిణయము

గ్రంథకర్త

గన్నవరపు

సూర్యనారాయణమూర్తి

వేగుచుక్క ముద్రాలయమున ముద్రితము.

1926.

# ఆంధ్రభారతీ గ్రంథాలయము

బరంపురం, (గంజాం జిల్లా.)

# రుక్మిణీ పరిణయము

అను

(ఐదంకముల నాటకము)

ఇయ్యది

మ॥రా॥రా॥ గన్నవరపు సూర్యనారాయణమూర్తి కవిగారిచే

రచింపఁబడి,

ఆంధ్రభారతీ గ్రంథమండలిచేఁ బ్రచురింపఁ బడినది.




V. J. P, Works, Berhampore.

*Registered*] [*Price Rs 0—14—0*

## (రిజిస్టర్డు) శిలాజత్తు రసాయనము (రిజిస్టర్డు)




ఈ దేశమున దీని పేరు, గుణములు తెలియనివా రుండబోరు. చప్పున శరీరపుష్టి, బలము నిచ్చు గొప్ప బలవర్ధక దివ్యౌషధములలో నిది. మిక్కిలి శ్రేష్ఠమైనదని విమర్శకుల వలన గనిపెట్టబడినది. కఠినమైన అజీర్ణరోగము, బలమైన వాతరోగములు, తీవ్రమైన పిత్త రోగములు, విడువని దగ్గు, శ్వాస, (ఉబ్బస) కఫ రోగములు, క్షయ, శుక్రనష్టము, సవా రోగములు, స్నాయు దుర్బలము, రక్త వికారము, చర్మ రోగములు, ఇంకను అనేక వ్యాధులను ఖండితముగ నిర్మూలము చేయును. మంచి పురుషత్వము, శుక్రవృద్ధి, శరీరకాంతి, అగ్ని దీప్తి, మొదలగు వాటిని అత్యద్భుతముగ కలుగజేయును. ఇది స్త్రీలకును మంచి గుణకారి. రోగులు, నిరోగులును సదా సేవింపదగిన ప్రాణతుల్యమగు అమృత ఔషధము. 1 డబ్బీ వెల రు 3—0—0 లు పోస్టేజీ 0—5—0 లు.

---

## (రిజిస్టర్డు) చిరటాసవ (రిజిస్టర్డు)

ప్రపంచమున జ్వరములను హరించు దివ్యౌషధములలో మా చిరటాసవ గొప్ప జయప్రఖ్యాతిని గడించుచున్నది. చలిజ్వరములకును, కొత్తజ్వరములకును, ఇంతయేల; సకలవిధ జ్వరములకును మా చిరటాసవ వజ్రాయుధము వంటిది. సీసా 1కి రు 3—0—0 లు 2 సీసాలకు పోస్టేజీ 8 అణాలు.

ఆయుర్వేదరత్న భిషక్ శిరోమణి,

బి. శ్యామసుందరరావు బ్రదర్సు,

గంజాం ఆయుర్వేద ఔషధాలయము, బరంపురం,



# రా జ పో ష కు లు

మ॥ రా॥ రా॥ శ్రీ రాజా వెలుగోటి కృష్ణయాచేంద్ర బహద్దర్ వారు, వేంకటగిరి రాజావారు, వేంకటగిరి.

మ॥ రా॥ రా॥ శ్రీ సురభి వేంకట లక్ష్మారావు నిజాంనవాబ్ వంతు బహుదూర్ రాజా ఆఫ్ జటప్రోలు వారు, జటప్రోలు.

మ॥ రా॥ రా॥ శ్రీ ఇజ్జితా సాక్ కందుకూరి బాల సూర్య ప్రసాదరావు బహద్దర్ దేవిఢీ.జమీందారు వారు, దేవిడి.

## పో ష కు లు

మ॥ రా॥ రా ఎమ్. వి. సీతారామారావుగారు, తిలారు వగైరా ఎస్టేట్లజమీందారు వారు బొంతలకోడూరు.

మ॥ రా॥ రా ఆతే నారాయణ పంతులుగారు, సీనియర్ సబ్ జడ్జి, ఏలూరు, (కృష్ణాజిల్లా)

మ॥ రా॥ రా॥ మోతే నారాయణ రావుగారు, ప్రొప్రైటర్ అండు లేండులార్డ్సు, ఏలూరు.

మ॥ రా॥ రా॥ గారపాటి బ్రహ్మయ్యగారు, లేండు లార్డ్సు, అండు టోలుగేటు కంట్రాక్టర్సు, ఏలూరు.

మ॥ రా॥ రా॥ గారపాటి సోమయ్యగారు, లేండులార్డ్సు, ఏలూరు, (కృష్ణాజిల్లా)

మ॥ రా॥ రా॥ అయ్యగారి మోహనరావు పంతులు గారు, బి. ఏ. బి. యల్. వకీలు, పార్వతీపురము.

మ॥ రా॥ రా॥ దేవరాజు వేంకటకృష్ణారావుగారు ప్రొప్రైటర్ వేంగుజుకు ప్రింటింగు వర్కు్సు, బరంపురం.

మ॥ రా॥ రా॥ కలవపూడి రంగాచారిగారు, లేండులార్డ్సు, రామతీర్ధము.

## సహాయులు

మ॥ రా॥ రా॥ మన్నం శేషాద్రిరెడ్డి గారు, సబ్ అసిస్టాంటు సర్జన్, గుంటూరు.

మ॥ రా॥ రా॥ తాడేపల్లి వేంకట కృష్ణయ్య గారు, లేండు లార్డ్సు, ఛత్రిపురము.

మ॥ రా॥ రా॥ శ్రీపాది సుందరరామ శాస్త్రి గారు, లేండులార్డ్సు, బరంపురం.

మ॥ రా॥ రా॥ తిత్తి బలరామయ్య నాయుడుగారు, లేండులార్డ్సు, బారువ.

మ॥ రా॥ రా॥ వైశ్యరాజు కాశీవిశ్వనాధరాజుగారు, మర్చెంట్సు అండు కమీషన్ ఏజంట్సు, బరంపురం.

మ॥ రా॥ రా॥ చిన్నం రామస్వామి గారు, రైల్వే పార్సెల్ క్లెర్కు, విజయనగరం.

మ॥ రా॥ రా॥ వడగ సుదర్శనము గారు, బొంతలకోడూరు.

మ॥ రా॥ రా॥ మాడుగుల రామమూర్తిగారు, అల్లినగరము.

మ॥ రా॥ రా॥ గుంటుక లక్ష్మప్పడుగారు వర్తకులు బరంపురం.

మ॥ రా॥ రా॥ ఆదిభట్ల సత్యనారాయణరావుగారు, భీమవరం

మ॥ రా॥ రా॥ జన్నిల కృష్ణమూర్తిగారు, బరంపురం.

మ॥ రా॥ రా॥ తూతిక బాలయ్యగారు, బరంపురం.

మ॥ రా॥ రా॥ మండవిల్లి సూర్యనారాయణ మూర్తిగారు, పోస్టల్ క్లెర్కు, సోంపేట.

మ॥ రా॥ రా॥ జి. జానకీబాయమ్మ గారు, బరంపురం.



# సంపాదకీయ భూమిక.

మేమీ గ్రంథమాల నెట్టిదుర్ముహూర్తమునఁ స్థాపించితిమో కాని; మాకోరకెచ్చట దాపరింప నిల్చియుండెనో మొదటినుండియు భంగములే సంప్రాప్తమై, ఇంతవరకును రెండవ ప్రచురమును బ్రచురింప వీలుగలుగఁ జేయకుండెను. కావున, ఈ జాగునకై మా చందాదారులు మమ్ము మన్నింపఁ బ్రార్థితులు. మొదటి ప్రచురమగు "ఇందుమతీ విక్రమసేన" మను నాటకమును బ్రచురించిన తరువాత, "శశికళ" లేక "రాణా ప్రతాప్" అను నవలను మా చందాదారుల కొసఁగ మనివిఁ జేసికొంటిమి గాని గ్రంథమాల విషయమునఁ గలుగు అవాంతరముల చేతను, మరికొన్ని కారణముల చేతను "ఈ రుక్మిణీ పరిణయమును" బ్రచురింప వలసి వచ్చినది. తమకనేక పని తొందరలచేఁ దీరుబాటు లేకపోయినను, మా ప్రార్థనపైఁ బది దినములలో ఈ నాటకమును వ్రాసి యిచ్చిన మ॥ రా॥ రా॥ గన్నవరపు సూర్యనారాయణమూర్తి కవిగారి కెంతయు మేము కృతజ్ఞులము. ఈ నాటకము భాషాభిమానులగు మా చదువరుల కెంతవరకు రుచ్యముగ నుండునో, నాటక సమాజములవారి కెంతవరకు ఉపకరించునో మున్ముందు తెలిసికొనవలసియున్నది. సాధ్యమగు నంత త్వరలో "శశికళ" లేక "రాణా ప్రతాప్" అను నవలతో మరల మా చందాదారులఁ గలిసికొందుము గాక!

సంపాదకుఁడు.

# ఆంధ్రభారతీ గ్రంథాలయము

బరంపురం, (గంజాం జిల్లా.)

**Established in 1924.**

1. ఇందు వత్సరమునకు మూఁడు గ్రంథములు ప్రచురింపఁ బడును.

2. ప్రతిగ్రంథముఁ బ్రచురణముకాఁగానే శాశ్వత చందాదారుల పద్ధతిని చందాదారులకు వీ. పీ. గాఁ బంపఁ బడును.

3. మూఁడు గ్రంథములు పోస్టేజీతో మూఁడు రూపాయిలకు మించదు. ప్రవేశరుసుము 2 అణాలు మాత్రమే వీ. పీ. లోఁ జేర్పఁ బడును.

4. మా గ్రంథమాలకు రాజపోషకులు గాను, పోషకులు గాను, సహాయులుగాను, ఉండు మహనీయులకు వీ. పీ. ఛార్జీలను మేమే భరించుకొని, ప్రచురింపఁబడు ప్రతి గ్రంథమును బంపుచుందుము. అట్టి మహనీయులు మఱి గ్రంథముయొక్క వెలను ఇవ్వనక్కర లేదు.

5. ఇందు ముఖ్యముగాఁ బ్రబంధములు, నవలలు, నాటకములే కాక; వీలైనయెడల మహనీయుల జీవిత చరిత్రములు, దేశచరిత్రములు, శాస్త్రములు మొదలగు దేశోపకార గ్రంథములు గూడఁ బ్రచురింపు చుందుము.

6. మా గ్రంథమాలకు 25 గురిని చందా దారులుగాఁ జేర్పు భాషాభిమానులను సహాయులుగా నెన్నుకొని, వారి నామములను ప్రచురింపఁబడు ప్రతి గ్రంథమునందును జేర్చి, ఉచితముగ వారి కాగ్రంథములను బంపుచుందుము.

గన్నవరపు సూర్యనారాయణ మూర్తి,

కార్యదర్శి.

# పీఠిక

ఇప్పటికి నాచే రచింపఁబడిన నాటకములలోఁ "బ్రచండ విజయము" లేక, "సైంధవాస్త్రమయము" తప్ప, తక్కిన "మోహినీ వసంతము" "ఇందుమతీ విక్రమసేనము" అనునవి షేక్స్పియర్ మహాకవి రచించిన "సింబలైను" "ఒథెల్లో" అను వాటి ననుసరించి వ్రాయఁబడి యుండుటచే నేదేని భగవత్సంబంధమైన విషయమును నాటకముగా రచించుటకు నిశ్చయించుకొని యుంటినిగాని; కారణాంతరములచే సఫలీకృత మనోరథుఁడను గాక నుండు సమయమున "ఈ ఆంధ్ర భారతీ గ్రంథమండలి" వారి ప్రోత్సాహముపై నీ "రుక్మిణీ పరిణయము" ను రచించి కృతకృత్యుఁడ నైతిని. వ్రాయు కాలము అతి స్వల్పమగుటచే ఈ గ్రంథమున నెచ్చటనైనఁ బొరపాటు లున్న సదయ హృదయులగు పండిత పాఠక మహాశయు లవ్వాటిని దెలియఁజేసినచోఁ జేతులు జోడించుకొని సవరించుకొనుటయే గాక, అట్టి మహనీయులకు నా మనఃపూర్వక వందన శతంబు లర్పించు చున్నాను.

తే 16—19—26 ది } ఇట్లు-బుధజన విధేయుఁడు,

బరంపురం, (గంజాం) } గన్నవరపు సూర్యనారాయణ మూర్తి.



# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

## పురుషులు

శ్రీకృష్ణుడు—కథా నాయకుడు.

బలరాముడు—శ్రీకృష్ణుని సోదరుడు.

సాత్యకి—శ్రీకృష్ణుని సోదరుడు.

భీష్మకుడు—విదర్భదేశాధీశ్వరుడు, రుక్మి జనకుడు.

రుక్మి—భీష్మకుని కుమారుడు.

అగ్నిద్యోతనుడు—రుక్మిణీదేవి గురువు.

శిశుపాలుడు—చేది దేశాధీశ్వరుడు.

జరాసంధుడు—మగధదేశాధీశ్వరుడు.

నలుగురు రాజులు—వివాహము జూడవచ్చినవారు.

సూర్యారావు—

శర్మ కవి—

పురోహితుడు—

ద్వారపాలకుడు—

## స్త్రీలు.

రుక్మిణీదేవి—కథానాయిక.

పరిమలత—రుక్మిణీదేవి చెలికత్తె.





శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీపరిణయము



## నాంది.

చ॥ సురలు భజింప, లోకములు • చొక్కి వెలుంగఁ బరాక్ర
మించి భూ। వరులగు మాగధాది రిపు • పంక్తిఁ గలంగ దు
రాత్ముఁ జైద్యు సం। గరమున మోసపుచ్చి నిజ • కాం
తను రుక్మిణిఁ గొన్న ద్వారకా। వరుఁడు మ • హాత్ములా
మిము న • పార కృపామతిఁ బ్రోచుఁ గావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

మహాత్ములగు నో సభాసదులారా, పరాశరస గోత్ర పవిత్రుండును, సూరమాంబా శ్రీనృసింహుల జ్యేష్ఠకుమారుఁడును నగు గన్నవరపు సూర్యనారాయణ మూర్తిచే శ్రీరామ చంద్రుని కంకితముగా రచింపఁబడిన "రుక్మిణీపరిణయ" మను నాటకమును దమ సమక్షమునఁ బ్రదర్శింప ననుజ్ఞ వేఁడు చున్నాను. (అని సభవంకఁ బరికించి) ఏమనుచుంటిరి?

గీ॥ భూ భరంబును దీర్పఁగాఁ • బుట్టినట్టి
యాది విష్ణువు కృష్ణుఁడై • యవతరించె;

లక్ష్మి రుక్మిణియై పుట్టి • కాంక్షలు కలన
రుక్మిణీ పరిణయము మా • ర్మ్రోఁగు జగతి.

అనియా? అట్లయిన వలయు పాత్రల సిద్ధముఁ జేసికొన నిదే పోవుచున్నాను. (అని కొంచెము ముందుకు నడచు చుండును.)

(అంతఁ దెరలో) ఓరోరి వాచాటా! ఎవఁడవురా నీవు?

గీ॥ భూ భరంబును దీర్పఁగాఁ • బుట్టు నట్టి
యాది విష్ణువు గొల్లవాఁ • డయ్యె నఁటరి!
లక్ష్మి రుక్మిణియై పుట్టి • కాంక్షలు కతన
వారి వైవాహికముఁ జూపు • ధీర మతివె?

సూత్రి—(విని భయముతో) అన్నా! ఎంతపనిఁ జేసితిని! శిశుపాల పక్షపాతియగు ఆరుక్మి నాపలుకులువినుటచే గాఁబోలు మండిపడుచు నాకిట్లు ప్రత్యుత్తరమిచ్చెను! ఇంక నేనిక్కడ నున్నచోఁ గీడు మూడక మానదు.

గీ॥ పామునకు కోరలందునఁ • బాప జాతి
వృశ్చికమునకుఁ దోఁకను • నెసఁగుఁ గాని;
మూర్ఖ జనులకు నిలువెల్లఁ • బొలుచు విషము
గాన, నవిమేలు మూర్ఖుల • కన్నఁ గొంత.

(అని నిష్క్రమించును)

(ఇది ప్రస్తావన)





శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీ పరిణయము



## ప్రథమాంకము—ప్రథమ రంగము

స్థలము—రుక్మిణి అంతఃపురము

(అంత రుక్మి రౌద్రముతో ఖడ్గపాణియై పూర్వపద్యమును జదువుచుఁ బ్రవేశించి నలువైపులను గలయఁ జూచి)

రుక్మి—ఏఁడీ! ఎవ్వఁడును గానరాఁడే! ఓరీ, వాచాటా, ఎందు దాగితివిరా? సమస్త యాదవకులారణ్య వీతిహోత్రుఁడై, ప్రచండ మార్తాండునిమాడ్కి రిపుల నల్లకల్లోల మొనర్పఁగల బాహుబల సమన్వితుండగు ఈ రుక్మి ప్రళయాంతకుని వలె వెలుఁగుచుండఁగనె వెఱ్ఱిగొల్లని విష్ణ్వంశ సంభూతునిగా నెంచి "రుక్మిణీ పరిణయము మార్కొల్పఁగు" ననుటకు సాహసింపనెంచితివా! ఓరీ, తులువా, నీ వనినట్లు చేయుటకు నీకుఁగా దల్ల త్రినేత్రునికైనను వశముకాదు సుమా!

చ॥ జలనిధు లింకినన్ సరియె, ◆ చండ దిశాగజరాజి ధారుణీ
స్థలిఁ బడిపోయినన్ సరియె ◆ చైద్యుఁడు రుక్మిణిఁ బొందుఁ

గాని, యో! తులువ, కృతాంతుమాడ్కి ఘన • దోర్బల
శక్తిని రుక్మి యుండఁగా! ఖలుఁడగు గొల్లఁడా హృదయ •
కాంతగ రుక్మిణిఁ గాంచి నిల్చుటల్?

ఇంతకును నీయదృష్టము బాగుగనున్నది. లేకున్నచో—

ఆ॥ వె॥ సన్నిపాత రోగి • చందంబు నీవట్లు
ఫలికినందు కిపుడు • నిలిచి యున్న
దోర్బలంబుఁ జూపె • తుంటె తుంటెములుగా
నిన్నుఁ దుర్ంపకుందు • నే దురాత్మ!

(అంత భీష్మకుఁడు ప్రవేశించి రుక్మినిజూచి ఆశ్చర్యముతో)

భీష్మ—కుమారా, ఏమట్లు కోపంబున నిలిచియుంటివి? విశేషించి యేమైన జరిగెనా యేమి?

రుక్మి—(కొంత శాంతించి) వేఱేమియును లేదు. ఎవ్వఁడో దురాత్ముఁడా కృష్ణుని విష్ణ్వంశ సంభూతుఁడనియును, అందుచే రుక్మిణీకృష్ణుల వివాహము మార్మోగు ననియు వచించుటచే అతఁడెట్టివాఁడై యుండునో చూచుటకిచ్చటకు వచ్చితిని గాని; యా పలుగాకి మాత్రము గానఁ బడుట లేదు. అందుచే నిట్లు నిలిచి యుంటిని.

భీష్మ—(చిఱునవ్వునవ్వుచు నాసనముపైఁ గూర్చుండి, కుమారుని గూర్చుండ నియమించి) కుమారా, అట్లయిన నీకింత కోపమేల? అతఁ డనినట్లు శ్రీకృష్ణుఁడు విష్ణ్వంశ సంభూతుఁడుగాని నీ వనుకొనునట్లు యాదవమాత్రుఁడు కాదుగద! అట్టి మహాత్మునితో బలవద్విరోధముఁ దెచ్చిపెట్టుకొనుట నీబోటివానికి భావ్యమగునా? అదియునుఁగాక, రుక్మిణీహృద

యము శ్రీకృష్ణుని యధీనమై యింతకుముందే నిలిచి యున్నది. అట్టిచో, శిశుపాల పక్షపాతమున నీ సోదరి నిత్యము దుఃఖసముద్రమున మునుఁగ శ్రీకృష్ణవియోగ మామెకుఁ గల్పించెదవా? శిశుపాల జరాసంధులచేఁ గృష్ణుఁ డొకవేళ నీకు విరోధి యగునేమో కాని, నీ వెనువెంటఁ బుట్టిన సోదరి నీకు శత్రురాలు కాదుకద! ఆమె దుఃఖించినచో నీకు మాత్రము సంతోషమగునా? తనయా, నీ పట్టిన పట్టువదలి రుక్మిణిని శ్రీకృష్ణునికిచ్చి వివాహముఁ జేయ సమ్మతింపుము. అదియునుఁ గాక—

ఉ॥ ఎక్కడనైన నున్నదె మ • హీస్థలి నిట్టి విచిత్ర మారయన్। ముక్కిడి గాఁడసాధముఁడు • ముద్దులపట్టికి నర్హుఁ డౌనఁటే! పెక్కులవేల పుత్రి, పృథ్వి • పీసతిభారము బాపఁ గృష్ణుఁడై॥ యక్కమలామనోహరుఁడు • యాదవుఁడై వెలుఁగొందె నెంతయున్.

రుక్మి—(కోపముతో) జనకా, ఇంకఁ జాలించిన బాగుండును. భూభార మడఁచుటకుఁ బుట్టిన కృష్ణునకు గొల్లకులముతప్ప వేఱొకటి దొరకినది కాదు కాఁబోలు! మీకా నిచ్చుటకిష్టమున్న అటులొనరింపక ఇన్నిమాటలేల నతనిని బెద్దఁజేసి బట్రాజువలెఁ బొగడెదరు? వేయిమేల! జనకా,—

గీ॥ రుక్మిణిని గృష్ణునకు నీయ • రూఢి నేని
పెద్దకొడుకుండె ననుమాట • వీడ వలయు;
సుతునిపైఁ గోర్కెయే యున్నఁ • బ్రీతి విరోధి
యైన కృష్ణుని మాటయే • మాన వలయు.

భీష్మ—కుమారా, ఎందుకీనిష్ఠురోక్తులు? నీవులేని ఈ శూన్య లోకముతో నాకు పనేమున్నది? తొందరఁ బుట్టువు దుఃఖం చిన నపజయమగునని ఇంతగాఁ జెప్పుచుంటినిగాని, నీవంత పట్టుఁ బట్టినచో నా మెకర్త మెట్లున్న నట్లగును గాన, నే నింక వేఱేమియును జెప్పను.

రుక్మి—అట్లయిన మీరామాట నాముందు మరి తలపెట్టఁబోకుఁడు. ఈవిషయమై మీరు కారుకదా—

సీ॥ కలుముల జవరాలిఁ • గమఁ బ్రేమ నేలెడు
గరుడ వాహనుఁడు చ • క్రింబుఁ దాల్చి,
హిమశైల రాట్పుత్రి • నేలెడు నెకిమీఁడు
డంబుగా వర త్రిశూ • లంబుఁ బూని,
పాలకడలి బొట్టె • వాణిపిప్రియ సుతుండు
రాయంచ నెక్కి పే • రాసఁ బూని,
జేజేల రాయుఁడు • చెలఁగి యైరావతం
బను నభ్రమాతంగ • మధివసించి,

గీ॥ వచ్చి పగఁగొన్న వారల • బల మడంచి,
రుక్మిణిని చైద్యునకు నిచ్చి • రూఢి మెరయఁ
బెండ్లిఁ గావింతునే గాని; • పేరుఁ బెంపు
లేని గొల్లఁడు వాఁడేడ • లేమ యేడ?

భీష్మ—(విచారముతో) నాయనా, నిష్కారణముగ వైర మూని చక్రధరుఁడగు శ్రీమహావిష్ణువును నిందించుచున్నావు. ఇదినీకుఁ దగదు. ఆమహాత్ముని దాడికోడి ఎందఱెందఱు మహావీరు లడుగంటిరో యాలోచింప కుంటివి కదా!

సీ॥ మీనమై జలధిలో • దానవేంద్రునిఁ గూల్చి
యజుకిచ్చె వేదంబు • లతఁడు గాడె!
కూర్మావతారమై • కొండ మూపునఁ దాల్చి
యనఘు వాసుకిఁ బ్రోచె • నతఁడు గాడె!
ఖలు హిరణ్యాక్షుని • బలమింకఁ జేయఁగా
నవతరించెను మేటి • యతఁడు గాడె!
పరమ భక్తునిఁ బ్రోవ • నరహరి రూపమై
యసురుని దెగటార్చె • నతఁడు గాడె!

గీ॥ బలిని పాతాళమునఁ ద్రొక్కి, • ఖల నృపాళి
నణఁచి, దశకంఠుఁ ద్రుంచెను • నతఁడు గాడె!
కంసు వధియించి యిప్పుడు • క్ష్మా తలమున
నలర నవతరించెను; దైవ • మతఁడు గాడె!

రుక్మి—(కోపముతో) అట్లయిన మీయిష్టము వచ్చినట్లు చేసి కొనక మధ్య నాతో నేలఁ బ్రసంగించెదరు? అంత పరాక్రమవంతుఁ డగుట చేతనే కాఁబోలు—

గీ॥ మాగధుని చేత నిరువది • మార్లు వీగి
భూమిపై నున్నఁ బ్రాణముల్ • పోవు ననుచుఁ
బిరికితనమున ద్వారకా • పురము నిలిపె
సాహసంబన్న నతనిదే • చాలు నధిప!

అదియునుఁగాక, మీకిష్టముండుట చే నటులొనరింపక నాకు బిరికిమందుఁ బోసెద రేల? ఇంతమాత్రమున కే భీతిల్లి గోవులఁ గాచుకొని జీవించునతనికి లోఁబడుదు ననుకొనుచుంటిరా? అట్లెన్నటికిని భావింపవలదు. ఇంక నేనీవిషయమై మరి మీతోఁ

బ్రసంగింపను గావున మీయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు. నే నింక సెలవుదీసికొనియెదను. (అని వడివడిగనిష్క్రమించును)

భీష్మ—(విచారముతో) అన్నా! గట్టిచిక్కు వచ్చినదే! ఏమి చేయుదును!

చ॥ ఇటు పొడగన్న నాయిఁ యటు • లీ యని చూచిన గో
యిరుయయ్యె; సం! కెటులఁ జరింతు! ముద్దుసుత • యేమన్ఁ
గనుంగొని నిల్చియుందునా!! ఇటువలెఁ బుత్రి పీడి దా •
యించుచుఁ బ్రాణము లూనియుందునా!! ఎటువలె నేమి
చేయుదు మ • హేశ్వర, దిక్కెవఁడింక నెవ్వరో!

ఝా రా! ఆడుబిడ్డలఁ గన్నవారి సుఖసంతతియు నింతియే కదా! ఈ కఠోరవార్త నామె కెట్లు తెలియఁజేసి యా శిశుపాల హత కుని వరింప నొప్పుకొందును! ఈ సంగతిఁ జెప్పుటవేఁ తడప్రగ నామె యీలోకమునుండియే తరలిపోవును! ఏమి చేయుదును?

గీ॥ సుతులు గలుగంగ లేదని • మతి విచార
మందుదురు గాని; యిటుల దు • ర్మార్గులైన
కొడుకులను గాంచుటకు మారు • గొడ్డు లైనఁ
గొంత మట్టుకు మేలెయగు • స్వాంతమునకు.

ఏది ఎటులున్నను అనుభవింపక తప్పదుకదా! కర్మమున కెవరు కర్తలు కాఁగలరు? ఈవిషయ మెట్లు పరిణమించినను సంతసముగనే యనుభవించెదను గాక! (అని నిష్క్రమించును)

(యవనిక జారును)



స్థలము—రుక్మిణి యంతఃపురము

రుక్మి—(విచారముతోఁ జేతులుజోడించుకొని మీఁదికిఁ జూచి)

శ్లో॥ అంబా, సర్వ సుపర్వకోటి జననీ, యార్యా, జగద్రక్షకీ,
కల్యాణీ, కమలాసనస్థ చరణా, కాదంబ సంవాసినీ,
గాయత్రీ, కరుణా కటాక్ష లలితా, మాంపాతు లోకేశ్వరీ,
లోకానందకరీ, శుభోదయకరీ, చిద్రూప సర్వేశ్వరీ.

అమ్మా, నాకీగతిఁ గల్పించెదవా! బాల్యమాది యేమహాత్ముని పాదసరోజముల సేవఁజేయు భాగ్యము లభించునని యువ్విళ్లూరుచు దినమొక యేడువలెఁ గడుపుచుఁ గాలము వెళ్లఁబుచ్చుచుంటినో; ఏ మనోహరుని రూపముతప్ప వేఱెట్టిదీ లోకమున నాకు కనఁబడకుంకి సంతోషసముద్రమున మునిఁగి తేలియాడుచుందునో; ఏచిత్తచోరుఁడు నా హృదయ మపహరించుటచేఁ బనరాని బాధలందుచు నీ పాదభజనచే నాతనిఁ గోరి యుంటినో; అట్టినా ప్రాణేశ్వరుని, నా జీవ ధనమును, నా యాది మూర్తిని జూపించి పుణ్యముఁ గట్టుకొనుము. ఎందఱెందఱు మహా పతివ్రతలు నీపాదభజనచే ధన్యులై విలసిల్లుచుండిరో నీకుమాత్రము తెలియదా? అట్టిచో మూర్ఖుఁడగు శిశుపాలుఁడా నన్ను వరింపనెంచుట? కన్నకూతురనగు నాకీ కష్టము సంప్రాప్తముఁ జేసినచో నా మనోనిశ్చయము నీ వెఱుఁగనిది కాదుకద? అట్టిచో నేలనీరీతి ఁజాగొనరించెదవు? (అని కోపముతో మీఁదికిఁ జూచి) ఓరీ, శిశుపాలహతకా, సింహముపాలిసొమ్ము గోమాయువు హరింప నెంచినటుల నీవా నన్ను వరింప నెంచుట! ఆ యాదవ సింహము నెవనిగా భావించుకొని గర్వించు

చుంటివి? ఆ మహాత్ముని సంగతి నీకింకను దెలియదు కాఁబోలు? అట్లయిన నించుక తెలియఁ జెప్పెదను వినుము.

సీ॥ పదునాల్గు లోకముల్ • పరగఁ గుక్షిని దాల్చి
పరుల కుక్షిని బుట్టు • ప్రభువరుండు,
లోక కంటకులైన • ద్రోహులలన్ బరిమార్ప
నవతరించెను నట్టి • యాది మూర్తి,
పాల సంద్రములోన • ఫణి శయ్యపై నెల్గి
భక్త కోటిని బ్రోచు • భాగ్యశాలి,
బ్రహ్మ మహేంద్రాది • పాలక వర్గంబుఁ
బాలించు జగదేక • పాలకుండు,

గీ॥ కృష్ణుఁడై పుట్టి సంగర • కేళి లోన
నీచులగు నిన్నుఁబోలు దు • ష్టులను బరులఁ
ద్రుంచుటకు నట్టి మహితాత్ము • నెంచు నన్నుఁ
గోరెదవె? ప్రాణముల పైని • గోర్కె లేదె?

కావున నీవా తుచ్ఛుఁడగు జరాసంధుని మాయ మాటలకు లోనై నిష్కారణముగ నా యాదవసింహముచేఁ గంసునివలె నేలపైఁ బడఁబోకుము. ఒకవేళ మాయన్న యజ్ఞానము నీకును బట్టుకొన్నచో నన్నుఁ బెండ్లాడుటకా శ్రీకృష్ణ భగవానుఁడు దక్క నెందఱెందఱు సాయమై వచ్చినను ఎవ్వరికిని సాధ్యము కానేరదు సుమా!

(అంత రుక్మిణి చెలికత్తెయగు ప్రేమలత ప్రవేశించి)

ప్రేమ—(విచారముతో) అమ్మా, ఎందఱు చెప్పినను వినకుండు టచే నెట్లయిన శిశుపాలుని వరింపక తప్పదని మీ తండ్రి

గారు సెలవిచ్చి పంపిరి.

రుక్మి—(కోపముతో) ఏమీ! మాయన్న వినకుండుటచే నేనా మూర్ఖుని వివాహమాడవలయునా? నాపెండ్లికి మాయన్న యే కర్త కాఁబోలు! సరియే; ఎటులా తుచ్ఛునికిఁ గట్టి పెట్టెదరో నేనును గొంచెము చూచెదను గాక!

శా॥ నేనే శ్రీహరి, లోకపాలుని, జగ ♦ న్నిర్మాణ కౌశల్య వి। జ్ఞానైకాత్ముని గాంక్షఁ జేసి గత జ ♦ న్మంబందు సంసే వలున్। దానముల్, వ్రతముల్, తపంబులును స ♦ ద్భక్తిం గడుం జేసినన్। నా నాథుండగుఁగాక దేవకిసుతుం ♦ డానంద మిఁ పొందఁగన్.

కావున నీవా విచారము నింకఁ గట్టిపెట్టి మా గురువుగారి నొకసారి యిటు తీసికొని రమ్ము.

(అంత అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును)

శ్రీమ—(అగ్ని ద్యోతనుని చూచి చిఱునవ్వు నవ్వుచు రుక్మిణితో) అమ్మా, అనుకొను చుండఁగనే యాచార్యులవారు దర్శన మిచ్చుటచే ఇంక నీకోరిక తప్పక నెరవేర గలదని నిశ్చయముగఁ జెప్పఁగలను. కావున శ్రీకృష్ణుఁ డింక నీ హృదయ ధనమనుమాట ముమ్మాటికిని నమ్మి ధైర్యముగ నుండుము.

రుక్మి—(చిఱునవ్వు నవ్వుకొనుచు గురువుగారిని జూచి) ఆచార్యోత్తమా, నమస్కారము. (అని నమస్కరించి యొక ఆసనముఁ జూపును.)

అగ్ని—(సంతోషముతో) శ్రీకృష్ణ కర గ్రహణ ప్రాప్తి

రస్తు. (అని ఆశీర్వదించి ఆసనముపైఁ గూర్చుండును.)

ప్రేమ—(చిఱునవ్వు నవ్వుచు రుక్మిణిని జూచుచుండును.)

రుక్మి—(ప్రేమలత నవ్వుఁగని పెట్టి సిగ్గుచేఁ జిఱునవ్వునవ్వుచు) ప్రేమలతా, నీవింక లోనికిఁ బొమ్ము. ఇచ్చటనున్న నీవన్నిఁటికిని ఎకసక్కెములే చేయుచుందువు.

ప్రేమ—(మరింత నవ్వుచు) చెలీ, అప్పుడే పొమ్మనెద వేల? శ్రీకృష్ణుఁడు నీవద్దకు వచ్చినప్పు డెట్లయినను నేనవతలకుఁ బోవలసిన దాననే కదా!

అగ్ని—(నవ్వుచు) ప్రేమలతా, హాస్యమున కిది సమయముఁ కాదు. ఏదో చెప్పుటకు నున్నది కావున; నీవింక లోనికిఁ బోయిన బాగుండును.

ప్రేమ—(నవ్వుచు) నాకా మాత్రము తెలియకపోదు. శ్రీకృష్ణనెట్లయినను దోడి తెమ్మనుటకుఁ దప్ప మాచెలికిఁ జెప్పుటకు వేరేమున్నది? (అని చిఱునవ్వు నవ్వుచు రుక్మిణిని జూచి నిష్క్రమించును.)

రుక్మి—(ప్రేమలత మాటలకు సిగ్గుఁ బడుచు నూరకుండును.)

అగ్ని—అమ్మా, సిగ్గుఁబడుటకిది సమయము కాదు. మరి వారము దినములలో మీతండ్రిగారు నిన్ను శిశుపాలునికిచ్చి వివాహముఁ జేయ లగ్న మేర్పాటుఁ జేసిరి. కావున నీవెంత మాత్రము మథైర్యపడక నీ హృదయమున నుండు సంగతి నా కెఱిఁగింపుము.

రుక్మి—(విచారముతో) మహాత్మా, తమ కన్నియును దెలిసి యుండుటచే నే వేరుగఁ జెప్పవలసిన దేమున్నది? ఎట్లయినను ఆ దేవకీసుతునికి నా యీ దుస్థితినంతయు జాలికలు

గునట్లు తెలియఁజెప్పి నన్ను దీసికొని పోవలసినదని ప్రార్థింపుఁడు. ఇదియే నా ప్రార్థన. అందుచే నా పలుకులుగా ఈ పలుకులా మహాత్మునికి విన్నవించి ప్రాణదానముఁ జేయు మనుఁడు.

సీ॥ శ్రీయుతాకారు వి ♦ శ్వేశార్చ్య శ్రీపాద
కమలంబులకు నమ ♦ స్కార మనుఁడు,
కల్యాణి నీ సేవఁ ♦ గామించి నినుఁ గాంచ
నిముసంబు యుగముగా ♦ నెంచు ననుఁడు,
నాయకిగాఁ గోరి ♦ యా యధమాధముం
డైన చైద్యుఁడు గర్వ ♦ మూని ననుఁడు,
భూపాల నీ పాద ♦ ములను నెంచెడు కన్య
నారడిఁ బెట్ట న ♦ న్యాయ మనుఁడు,
గీ॥ మోహనాకార, నీ ముద్దు ♦ మోముఁ జూప
వేగ రాకున్న జీవముల్ ♦ వీడు ననుఁడు,
భైరవీసాక్షి రుక్మిణీ ♦ ప్రాణధవుఁడు
కృష్ణుఁడని యెంచి వచ్చి ర ♦ క్షింపు మనుఁడు.

అగ్ని—(సంతోషముతో) అమ్మా, ఇంతగా నీవా మహాత్మునికి విషయమై సందేశమంపుకొన వలయునా? ఇచ్చటికథనంతయును నేఁ జెప్పుటయే తడవుగ నాతఁడు వచ్చుటయే కాదిటు వినుము.

ఉ॥ చండ శరాగ్ని కీలలకుఁ ♦ జైద్యునితో మగధేశుఁ గూర్చి
భూ। మండల మెత్తి నిల్చినను ♦ మానక నిన్ గొనిపోవు
నంచుఁ ద। చ్చండ పరాక్రమోన్నతికి ♦ సాటి జగంబున

లేదటంచు నో! యంబుజనయన, యెంచి ముద • మారఁగ
నిజపురము పోయి వచ్చెదన్.

అని మఱియుఁ గాక —

గీ॥ యాదవుఁ డటంచు, శాత్రవుఁ • డనుచు రుక్మి,
చైద్య మాగధ ప్రముఖులా • సత్వ మూర్తిఁ
దలపడఁగ నెంచి యగ్నిలో • పలను బడెడు
శలభముల పోల్కి నున్నారు • సత్య మబల.

కావున వారల కోర్కెయే నెరవేరును గాక! నీవింక లోనికిఁ బోయి సంతోషమున నుండుము. నేనిప్పుడే పోయి కార్య సాఫల్య మొనరించుకొని వచ్చెదను. (అని నిష్క్రమింపుచుండ రుక్మిణియును దక్షిణ వైపునుండి నిష్క్రమించును.)

(యవనిక జారును.)

గద్య

ఇది శ్రీసీతా రామచంద్ర చరణారవింద సేవా సమాసాదిత సరససాహిత్య కవిత్వవైభవ పరాశరసగోత్రోద్భవ గన్న వరపు వంశాంబోధి పవిత్రచంద్ర వేంకటేశ్వర పౌత్ర, నారసింహేశ్వర పుత్ర, సూరమాంబా గర్భశుక్తి ముక్తాఫల సూర్యనారాయణ మూర్తి ప్రణీతం బైన "రుక్మిణీపరిణయ" మను నాటక రాజమునఁ బ్రథమాంకము సమాప్తము.





శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీ పరిణయము

## ద్వితీయాంకము — ప్రథమరంగము

స్థలము — ద్వారకానగరము

(శ్రీకృష్ణ బలరాములు ప్రవేశింతురు)

బల — నిజము, నిజము. నీవనినట్లంతటి మూర్ఖులగుట చేతనే పదిపదిగ దండెత్తి వచ్చుచుండుటయేగాక, తమబోటి పరాక్రమవంతులీముల్లోకములయందుఁగూడ లేరని విఱ్ఱవీఁగుచున్నారు. సోదరా, ఏమని చెప్పుదును! పులినిజూచి నక్కవాతఁ బెట్టుకొనినదన్నట్లు ఆజరాసంధాది హితులనుజూచి రుక్మి యనువాఁడుఁ గూడ మనల నిప్పుడు నిరసింప సాహసించు చున్నాఁడు!

శ్రీకృ — (ఆశ్చర్యముతో) అన్నయ్యా, మనల నిరసించుటకు వానికిఁగల దురుద్దేశ మేమిటి?

బల — వేఱేమియును లేదు. వాని సోదరి రుక్మిణి విషయమై నీకును గొంతవరకుఁ దెలిసియేయుండు ననుకొనియెదను. ఆమె నిన్నుఁగాక అన్యుల వరింపనని నిశ్చయించు కొనియుండ,

ఆమెను, ఆమెవారినిఁగూడ లక్ష్యపెట్టక శిశుపాలునికామె నిచ్చి వివాహముఁ జేయ నాతఁడు ప్రతిజ్ఞఁబట్టి యుండెను.

శ్రీకృ—(కోపముతో) సరియే; ఈయవచ్చును. అట్లయిన మనల నిరసించు నుద్దేశ మిందేమున్నది?

బల—(కోపముతో) తమ్ముఁడా, నీకుఁ దెలిసిన సిప్పుడే యాగ్రహ మొందెదవని చూచుచుంటిని గాని; ఆ మూర్ఖుని కంటికి మనము వెఱ్ఱిగొల్లలమఁట! అందుచేఁ బితికితినముస ద్వారకా నగరముఁ గావురముఁ జేసికొని జీవించు చుంటిమఁట! శిశుపాల జరాసంధులకు మించిన యోధవరులీ పదునాలుగు భువనముల నెచ్చట వెదకినను గానరారఁట! కను కనే రుక్మిణి నిన్ను వరించియున్నను దప్పించి, శిశుపాలుని కామెనిచ్చి వివాహముఁ జేయునఁట! ఇంతకన్న మనల నిరసించుట కింకేమి కావలయును?

శ్రీకృ—(కోపముతోఁ దనలో) ఔరా, మూర్ఖా, తొండ ముదిరి యూసరవిల్లి యయినదన్నట్లు నీవును నాతోఁ దలపడ సాహసించితివా? కానిమ్ము. నీ తుళ్లిపాటుఁ గూడఁ గొంతవరకుఁ జూచెదను గాక! (అని ప్రకాశముగా) అన్నయ్యా, మీకీ పిచ్చిభ్రాంతి పుట్టినదేమి?

గీ॥ పలుకు లెన్నియొ పలుకంగ ♦ వచ్చు గాని,
అటుల నొనరించుటలు కష్ట ♦ మౌను గాదె?
లోకజాలంబు మ్రింగ మం ♦ డూక మెంత
యరచినను గోర్కెఁ గననౌనె ♦ యనఘ, చెపుము!

బల—(చిఱునవ్వు నవ్వుచు) అట్లయిన రుక్మిణిని బలిమిని వివాహమాడ నిశ్చయించుకొంటివా యేమి?

శ్రీకృ—(కోపముతో) సందేహ మేమి?

మ॥ సురలోకంబు సహాయమైనను రిపు ♦ స్తోమంబునం జొచ్చి,
భీ। కర శస్త్రాస్త్ర మహానలార్చి కెమరా ♦ ఘ్నాపాలకా
నీకమున్। ధరణిం గూల్చి, విదర్భ రాజ తనయన్ ♦ గై
కొందు లేకున్న సో। దర, కృష్ణుండనె నేను! చక్రమిది
స ♦ త్యంబైన చక్రింబఁటే!

బల—(ఆశ్చర్యముతో) తమ్ముఁడూ, దుస్సాధ్యమైన ప్రతిజ్ఞఁ బూనితివే! దీని విషయమై నేనింక జాగ్రత్తగ నుండవలసి యుండును గాఁబోలు!

శ్రీకృ—అన్నయ్యా, సృష్టిచిత్రము నుండి యుదయించిన మహాత్ముల నందరిని నే నెఱిఁగిన వాఁడను గాకపో లేదు. అట్టి వీరుల కన్న వీరి గొప్ప ఏమున్నది?

మ॥ అవతారంబులు పెక్కులయ్యె జగతిన్ ♦ వ్యాపించు క్షో
భాగ్నికై,। యవివేకాధము లెందఱో తెగిరి; దు ♦ ర్వ్యా
పారులన్ ద్రుంచు నా। కు విరోధంబనఁ బందువే యగుట
నీ ♦ క్షుద్రాత్ములన్ గెల్చుటో। కృ— విశేషం బగునే? వి
దర్భ తనయన్ ♦ గైకొంట యాశ్చర్యమే?

బల—అట్లయిన నేనింక వలయు సైన్యములను సిద్ధముఁ జేసి కొనుటకై పోయెదను.

శ్రీకృ—ఇప్పటినుండియు మనకంత యగత్య మేమున్నది? స్వయంవర కాలము సమీపించినఁ గదా మనము ప్రయత్నమున నుండుట?

బల—ఓరీ, వెఱ్ఱివాఁడా, స్వయంవర మెవరికి? రుక్మిణిని శిశు

పాలునికిచ్చి వివాహముఁ జేయుదురు గాని; స్వయంవర
ముఁ జాటింపరు. ఎల్లుండియే ముహూర్తము. (అని శుభ
లేఖ నిచ్చును.)

శ్రీకృ—(శుభలేఖ నందుకొని చూచి యించుక కోపముతో)
సరియే. మీరింక మీ ప్రయత్నమున నుండుఁడు. నేనును
మీ వెనువెంటనే వచ్చెదను.

బల—మంచిది. (అని నిష్క్రమించును)

శ్రీకృ—(తనలో) ఎంత యాశ్చర్యకరమైన సంగతి వింటిని!
ఈ మూర్ఖుఁ డా మూర్ఖునికి రుక్మిణినిచ్చి వివాహముఁ జేయు
నఁట! ఎటులా కార్యము నెరవేర్చునో చూచెదను గాక!

(అనుబంధము 3)

(అంత ద్వారపాలకుఁడు ప్రవేశించి చేతులు జోడించుకొని)

ద్వార—దేవా, బ్రాహ్మణుఁ డెవరో యేలినవారి దర్శనము
నకై తలవాకిటఁ గాచుకొని యుండెను. సెలవయ్యెనేని
లోనికిఁ బంపెదము.

శ్రీకృ—ఓరీ, వేగముగ వారిని లోనికిఁ బంపుము.

ద్వార—మహాప్రసాదము. (అని నిష్క్రమించును.)

(అంత అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును.)

(అనుబంధము 4)

అగ్ని—(సంతోష పారవశ్యములతో) ఆహా! ఏమి నా భాగ్య
ము! నా పూర్వజన్మ పుణ్యముచే బ్రహ్మాది దేవతలుఁ
గూడ వేలకొలఁది యేండ్లు తపంబుఁజేసి యా తపోబలముచ
నైనఁ గాంచనేరని శ్రీ మహావిష్ణువు నివాస స్థలమును గ

న్నుల కరవుదీరఁ గాంచి యానందింపఁగల భాగ్యము నాకు లభించినది. (అని ప్రక్కలఁ గనుఁగొనుచు) ఏమి ఈ ద్వారకాపుర సౌభాగ్యము! ఎంత చూచినను దనివితీరకున్నదే! ఎటు చూచినను గలుగు సంతోష సౌభాగ్యమున నా శరీరము నాకు స్వాధీనము గాకున్నది కదా! (అని మీఁదికిఁ జూచి చేతులు జోడించుకొని)

మ॥ గత జన్మంబున నెంత పుణ్యము మహా • కాంక్షన్ నినుం
గోరి చే। సితినో; జన్మము సార్థకం బయినటుల్ • శ్రీ
నాథ, బ్రహ్మాది దే। వతలున్ నేరని నీమహా మహిమ
మున్ • వర్ణించి, వీక్షింపఁ జే। రితి నీ సన్నిధి ధన్యుఁడై తిఁ
గదనే • కృష్ణా, జగన్నాయకా.

కావున నీ దివ్యమంగళ విగ్రహమును గన్నుల కరవుదీర వీక్షించి, నా జన్మ సాఫల్యముతోఁ బాటు కార్య సాఫల్యముఁ గూడ నొందెదను గాక! (అని యించుక ముందుకు నడచి శ్రీకృష్ణుని జూచి, సంతోష సంభ్రమములతోఁ దనలో) ఆహా! ఏమి ఈ విశ్వ మోహన సౌభాగ్యము!

సీ॥ అన్నిఁటి మూలమై • అది లేకుండ వి
భ్రాజితుం డైనట్టి • భవ్య మూర్తి!
లోక జాలములు హ్రా • ల్లోకంబునన్ జేసి
లోకంబునన్ నిల్పు • శ్రీకరుండు!
కల జీవముల యందు • వెలుఁగుచు వెలికిఁ దా
వెలుగొందు జ్యోతికి • వెలుఁగు జేయు!
పదునాల్గు భువనముల్ • పాలనాంతంబునఁ
బాలింప సమకట్టు • పాలకుండు!

ఆ॥వె॥ సర్వ భూత మయుఁడు! • సర్వ సాక్షియు! సర్వ
కర్తృ కర్త! సర్వ • హర్తృ హర్త!
సర్వ సముఁడు! లోక • సర్వేశ్వరుండగు
కన్న తండ్రి నేఁడు • గాంచఁ గంటి!

మ॥ ధరణీ భారము బాప నెంచి జగదా • ధారుండు శ్రీ
కృష్ణుఁడై। వరలెన్; లక్ష్మియె రుక్మిణీసతిగ సౌ • భాగ్యం
బునన్ నిల్చె; ఇ। ద్దరి వైవాహిక మెంత పుణ్య మతినో
• తథ్యంబుగాఁ గాంచు సం। బరమున్ బూనితి నా తపం
బలరె; మద్భాగ్యంబు సామాన్యమే!

కావున నే వచ్చిన కార్యమెఱిఁగించి కృతార్థుఁడ నయ్యెదను గాక! (అని శ్రీకృష్ణునిఁ జేరఁ బోవును.)

శ్రీకృ—(అగ్నిద్యోతనునిజూచి సంతోషముతో) మహాత్మా, నమస్కారము. (అని వంగి యతని పాదములకు నమస్కరించును.)

అగ్ని—(ఆనంద పారవశ్యములతో) రుక్మిణీ కరగ్రహణ ప్రాప్తి రస్తు. (అని యాశీర్వదించి, పాదములపై నున్న శ్రీకృష్ణునిఁ గౌఁగలించుకొని లేవనెత్తి తనలో)

సీ॥ సమధిక జ్ఞాన సంపూర్ణ • సత్త్వులైన
యోగులకుఁ బట్టు వడనట్టి • భోగి శయనుఁ
డెంత పుణ్యుండనో నేటి • కివ్విధమున
నాదు కౌఁగిటఁ జిక్కెఁగా • మోద మలర!

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు) మహాత్మా, ఈ యాసనము నలంకరింపుఁడు. (అని యొక ఆసనముఁ జూపి, యతఁడు కూర్చుండిన పిదపఁ దాను కూర్చుండి,)

చ॥ ఎవని ధరాతలంబు జని • యించెదు మీ మృదు పాద
ధూళిచే। దివిరి పవిత్రమయ్యె? భవ • దీయ మహోన్నత
నామమేమిః? భూ। ధవ్రుఁడు శరణ్యకుండగునె? • తా మరు
దెంచిన కార్యమేద్ది? సం। స్తవగుణ, వేగ మిర్యోడ ము •
వంబున నా కెఱిఁగింపవే దయన్.

అగ్ని—(చిఱునవ్వు నవ్వుచుఁ జేతులు జోడించుకొని) దేవా,
అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండవగు నీ వెఱుఁగని
దేమున్నది? సమస్తము నెఱిఁగియు నెఱుఁగని వానివలె
నన్నే యడుగు చుంటివా?

మ॥ సురలున్, సిద్ధులు, సంయమీశ్వరులు। శే • షుండాది
నానా జగ। స్థిర సంపూజ్యులు భక్తి తత్పరులునై • సేవిం
చియున్ గాంచ నే। రరు నీ మాయను; అట్టి నీకుఁ దెలి
యన్ • రాకుండెనె నేను ని। న్నరయన్ వచ్చిన కార్య
మింతయినఁ గృ • ష్ణా, దేవకీ నందనా!

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు) మహాత్మా, తమబోటిమహనీ
యుల పాదసేవకుఁడ నగుటచేతనే నాకట్టిమైశ్వర్యము సం
ప్రాప్తమైనది. లేకున్నచో, నెట్లబ్బును? (అనికొంచెమాగి
జ్ఞాపకమునకు వచ్చినట్లభినయించి) అన్నట్లు—రుక్మిణీవివా
హ విషయమై నాకేమియుఁ దెలియఁ జెప్పితిరికారు కద!

అగ్ని—(సంతోషముతో నవ్వుచుఁ జేతులు జోడించుకొని)
దేవా, అందుకొఱకే తమ దర్శనమునకు వచ్చితిని.

శ్రీకృ—(చిఱు నవ్వు నవ్వుచు) అనఁగా!—నా కర్థము
కాలేదు.

అగ్ని—మహాత్మా, నా నోటనే వినఁగోరు చుంటివి కాఁబో
లు! అట్లయిన వినుము.

సీ॥ ఎఱుఁగుదువే కదా • ధరణీశ, రుక్మిణి
నిన్నుఁ గోరి ప్రేమమ్మై • నిలచి యుంటః
ఆమె నిప్పుడు రుక్మి • యను వాఁడు మూర్ఖుఁడై
చైద్య మాగధులతో • నుద్యమించి,
నీయందుఁ బగఁ బూని • నీరజాక్షికిఁ బెండ్లి
శిశుపాలునకు నిచ్చి • చేయ నుండె;
నిన్నుఁ గాక యొరులను • గనదంట రుక్మిణి
రాకున్న నిమునంబు • బ్రతుకదంట,

గీ॥ మానినీమణి నన్నంపెఁ • గాన నింక
వేగ మేతెంచి, మగధాది • వీర వరులఁ
దోలి, నిజకాంతగా నామె • నేల వలయు;
క్షణము నాలస్య మైన నే • చంద మగునో!

శ్రీకృ—(ఆశ్చర్యము నభినయించుచు) తమరిట్లు వచించిన
నే నేమి చేయఁ గలను? అదియునుఁగాక, తల్లిఁదండ్రు లిష్ట
మునై చేయుచున్న వివాహమును దప్పించి యామె కోరి
నంతమాత్రమున నెటులామెను వారినుండి విడఁదీసి పరిణ
యముఁ జేసికొనఁ గలను?

అగ్ని— దేవా, ఇందుఁ దప్పేమున్నది? దీనినే కదా పెద్దలు
రాక్షస వివాహమని చెప్పుదురు? ఇందు మంత్రములు
గాని, తంత్రములు గాని లేవు. తలిదండ్రాదులతో నెంత
మాత్రము సంబంధము లేదు. వధువు కోరుటయే చాలును.

ఇదియే యీ వివాహధర్మము కావున వేరేమియుఁ బలుకక రుక్మిణీ ప్రాణ రక్షణమునకై పయనముఁ గమ్ము. (అని శ్రీకృష్ణుని గడ్డముఁ బట్టుకొనును.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు) నేనా సంగతిఁ దమరు వచ్చుటకుఁ గొంతము పూర్వమే నిశ్చయించుకొని యుండ, ఇంతలోఁ దమ దర్శనభాగ్యముఁ గూడ లభించినది. కావున రుక్మిణి విషయమై తమ రింతగాఁ జెప్పవలయునా?

గీ॥ మాగధుఁడె కాదు, భూలోక • మంత నిలిచి
దేవ దానవ కోటితోఁ • జేవఁ గొనిన
కదనమునఁ దోలి, శిశుపాలు • గర్వ మడఁచి
రుక్మిణిని దెత్తు లోకముల్ • మోద మలర.

కావున ఈ యుత్తరక్షణముననే పయనమై పోవుదము రండు. (అని బ్రాహ్మణుని చేయిఁ బట్టుకొని నిష్క్రమించును.)

(యవనిక జారును.)

గద్య

ఇది శ్రీసీతా రామచంద్ర చరణారవింద సేవా సమాసాదిత సరససాహిత్య కవిత్వవైభవ పరాశరసగోత్రోద్భవ గన్నవరపు వంశాంబోధి పవిత్రచంద్ర వేంకటేశ్వర పౌత్ర, నారసింహేశ్వర పుత్ర, సూరమాంబా గర్భశుక్తి ముక్తాఫల సూర్యనారాయణ మూర్తి ప్రణీతం బైన "రుక్మిణీపరిణయ" మను నాటక రాజమున ద్వితీయాంకము సమాప్తము.





శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీ పరిణయము



తృతీయాంకము — ప్రథమరంగము

స్థలము — రుక్మిణి అంతఃపురము

(రుక్మిణి విచారముతోఁ బ్రవేశించున్న.)

(అనుబంధము ౯)

రుక్మి — అమ్మా, ఈశ్వరీ,

మ॥ తఱి యయ్యెం గద; యేమి సేతు! జగదా ◆ ధారుండు
శ్రీకృష్ణుఁ డీ। సరికిన్ రామికి నేమి హేతువో! మన ◆
స్తాపంబుఁ జేకూరెఁ! నే। కరణిం బ్రాణము లోర్చు దాన!
నను శ్రీ ◆ కాంతుండు కాపాడునో;। కరుణన్ జూడఁడొ!
కార్య మేగతిని సా ◆ గన్ జేయ లో నెంచెనో!

అక్కటా! ఏమి చేయుదును! ఎవరితోఁ జెప్పుకొనెదమన్నను, ఒక్కరైనను నాకాప్తులగు వారిచ్చట లేకపోయిరికదా! ఉండి నటువంటి యా మహాత్ముని గూడ శ్రీకృష్ణుని దోడి తెచ్చుటకై పంపించివేసితిని. వారుఁ గూడ నచ్చటి సమాచార మే మైనదియుఁ దెలియఁ జెప్పుట కిదివరకు రాకుండెను! తల్లి దండ్రులును దుష్టుఁడగు మా యన్నతో నేకీభవించుటచే నెవరి

తోఁ జెప్పిన నేమగునో యను సంశయము నాకే కలుగుచున్నది. (అని కొంచెమాగి) ఇంతకు నొకరితోఁ జెప్పికొనుట కేమున్నది? లోకజ్యోతి స్వరూపుఁడును, నా హృదయేశ్వరుఁడు నగు ఆ దివ్యమంగళ విగ్రహము నేఁడు నా మ్రోల నిలువకున్నచో నా మనో నిశ్చయమునే తప్పక యనుసరించెదను గాక! (అని మీఁదికిఁ జూచి)

మ॥ నిను ధ్యానించుచు, నీ మహో మహిమముల్ • నీ రూపు
వర్ణింపుచున్। నినుఁ బెండ్లాడఁగ నిల్చి యున్న నను బో •
నీ యంచు రాకున్నచో। నను నేఁ జెప్పఁగనేల? నీ వెఱుఁ
గవే నానాథ, యీ ప్రాణముల్। నినుఁ జేరన్ దలపోయు
వేగమె కదా • కృష్ణా, జగన్నాయకా.

కావున నీ యార్తరక్షణ బిరుదమును నామమాత్రావశిష్టముఁ జేసికొనక నీ పాదదాసినగు నన్నుఁ గటాక్షింప రమ్ము. ఆది నుండియు నేఁ గోరుచున్నదీ యొక్కటియే. (అని కోపముతో నించుక ముగముఁ బైకెత్తి) ఓరీ, శిశుపాల హతకా, నీకీ దుర్బుద్ధి పుట్టిన దేమిరా? హరి హరాదులు తలక్రిందైనను, ఈ శరీరము నా జీవితేశ్వరుఁడగు శ్రీకృష్ణ భగవానునికిఁ దక్క తక్కిన నీబోటి తుచ్ఛులఁ గలనైన నొల్లదని నీ వెఱుఁగవా? నిష్కారణము నపనిందఁ జెందుటకు గంపెడాసతో వచ్చితివి గాని; నీకీ కార్యము మాత్రము సాధ్యము కానేరదు.

గీ॥ మాగధుని నమ్మి, నీకుండు • మౌర్ఖ్య మెంచి
వచ్చితివి గాని; నీకింత • ఫలముఁ గలదె?

కృష్ణ సింహంబు నీపాలి • మృత్యువు వలెఁ
గాచుకొని యుండె నెఱుఁగుమా • కలుష, నీవు.

అందుచే నిష్కారణముగ నా యాదవసింహము కోపాగ్నిని భస్మీభూతముగాక బ్రతికియుందుము. ఈ వివాహాపేక్ష నీకవమానమునకో, మృత్యువునకో వచ్చినదని నా నమ్మకము. లేకున్నచో; ఆ మహాత్మునికెందు నీవు సరిపోలెదవని గర్వించుచుందువు? బహుసేనా సమన్వితుఁడ వనియా? లేక; రాజాధిరాజవనియా? ఓరీ, యవివేకీ, నీ సైన్యమునకును, నీ రాజ్యాధి పత్యమునకును ఆ దివ్యమంగళ విగ్రహ మెడమకాలి గోరు లక్ష్యపెట్టదు సుమా! నీ గర్వమంతయు ఆ జరాసంధ హతకుని జూచుకొని కాఁబోలు! సరియే; అట్లయిన నీకీ విషయమున నన్నియును ముందుకుఁ దెలియఁ గలవు.

ఉ॥ నీచుఁడ వీవుగాని; ధర • ఁ శ్రీ ధవుఁడౌ యదుసింహ మేడ?
గాల్। రాచిన నల్గిపోయెడు దురాత్ముఁడు నా మగధేశుఁ
డేడ? ఆ। నీచునిగూడి మిట్టిపడు • నీ చలమేడ దురాత్మ,
తాళుమా। చూచెద నీవె యా మహితు • సొంపు వచిం
పఁగ నేల నిర్మ్యోడన్.

(అని కొంచెమాగి, ఆకసము వంకఁ జూచి, అనుమానాశ్చర్యములతో) అయ్యో! సాయంకాలము కావచ్చుచున్నదే! శ్రీకృష్ణుఁ డిదివరకు రాకుండుటకుఁ గారణమేమై యుండునో కదా! నా సందేశముఁ గాని మన్నింపక యుండెనా? (అని కొంచెమాగి) అటులెన్నటికిని జరిగియుండదు. అట్లయిన నింకను రాకుండుటకుఁ గారణమేమి?—ఏమో, ఒకవేళ రేపటికి రాఁ గూడదా?

ఎల్లుండికదా లగ్నము. అదియునుం గాక, బాల్యము నుండి యు ఆ మహాత్ముని పాదసరోజములనే నమ్మికొని దినమొక యుగము వలె నాతనికై నిరీక్షించుచున్న నన్ని ట్లవమానముం జేయునా? నమ్మంజాల, నమ్మంజాల. (అని మరలం గొంచెమాగి యించుక సంశయముతో) ఎందుకైనను మా గురువు గారు తిరిగి వచ్చు వఱకును నా మనస్సు కుదుటం బడ కుండును. (అని విప్రునిం జూచి)

(అనుబంధము 6)

ఉ॥ నీకయి నిల్చి యున్న నను ♦ నీవె యనాదరణంబుం జేసి,
నన్। జేకొనకున్నం బ్రాణములు ♦ సిద్ధమునమ్ముము పోవు
నింక లో। కైక మనోజ్ఞ రూప, తగు ♦ నే? పద దాసిని
గాసిం జూపెదే?। నీ కృప కిట్టిపాటు ధర ♦ నేస్థలిం నిల్పెదె
జీవితేశ్వరా?

నీ మహాత్మ్యమా శిశుపాల జరాసంధులకింకను దెలియకున్నది! యాదవ మాత్రునిగా భావించు చుండుటచేం గనులు నెత్తి కెక్కుటను దుచ్చుండగు శిశుపాలుండు నన్నుం బెండ్లియాడ వచ్చుట నీకింకను దెలియకున్నదా? ముల్లోకము లడ్డువచ్చినను జరాసంధుం డీవిషయమై వానికిం దోడుపడక మానండంట! తల్లిదండ్రులును మాయన్నతో నేకీభవించుటచే నీవు గాక నా కింకెవరు దిక్కు? ఆర్త రక్షకుండవు. బాల్యమాది నీకై నిల్చి యుండు నీసతికిట్టి భంగపాటుం గల్పించెదవా? నిన్నుం జూచు కొనియే నేనింతవరకును జీవములు దాల్చియుంటిని. ప్రాణేశ్వరా, అట్టి నా మనవి యొకటి వినుము.

ఉ॥ ఏ క్రియనైనఁ గాని, ధర • నీశ్వరులెల్లఁ జూచుచుండ
నన్। జేకొని పెండ్లి యాడుటకు • సిద్ధముగా శిశుపాలుఁ
డుండె, నే। నీకయి నిల్చియుంటిఁ; జను • నే కద యాగతి
యైన జీవముల్। కాకికి రాజ హంసి సతి • కాఁ గలదే?
జగదీశ, చెప్పుమా?

కావున భువనమంగళ కరమగు నీ ముద్దుమోముఁ జూపించి నీ
సతినగు నన్నుఁ గాపాడుము.

(తెరలో) ఓహో! పురవాసు లారా!

గీ॥ లోకమూర్తియుఁ, ద్రిభువన • శ్రీకరుండు
కృష్ణుఁడై యొప్పి, మన పూర్వ • కృతము వలన
దరిసెనముఁ జూపె రుక్మిణీ • పరిణయమును
గాంచు వేడుకఁ బూని వీ • క్షించ రారె!

రుక్మి—(విని సంతోషముతో) ఆహా! ఏమి నా భాగ్యము!
ఎంత యానంద కరమైన సంగతి వింటిని! ఏ విశ్వమో
హన సందర్శన ప్రాప్తికై సకల లోకములు తల్లడిల్లు
చుందునో; ఏ దివ్య మంగళ విగ్రహమును గన్నుల కరవు
దీర వీక్షించుటకు బ్రహ్మాది దేవతలు నిరంతర మానం
దించు చుందురో; ఏ జగదేక మూర్తికై యార్తజను లెల్ల
ఁ జాతక పక్షుల వలె నాసించుచు నిల్చి యుందురో;
అట్టి ముల్లోక చక్రవర్తి, నిఖిల భువన వ్యాపకుఁడు, భక్త
జన సులభుఁడు నగు దేవకీ నందనుఁడు నా పాలిటి కల్ప
వృక్షము వలె సాక్షాత్కరింప వచ్చుచుండె నఁట! (అని
మీఁదికిఁ జూచి; చేతులుజోడించుకొని) అమ్మా, ఈశ్వరీ,

గీ॥ ఏ మహాత్ముని గాంక్షించి • యింత వరకుఁ
దాప కాంక్షుల్రిల పైవాల్రిలు • తపముఁ బూర్వ
కృతమునను గాంచితినో; యట్టి • కృష్ణ విభునిఁ
జూపితివి తల్లి ప్రాణముల్ • లేపు నట్లు.

(అంత అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును)

అగ్ని—(చిఱునవ్వు నవ్వుచు) అమ్మా, రుక్మిణీ,

ఉ॥ వచ్చెఁ గృపాకరుండు, యదు • వంశ పయోనిధి చంద్రుఁ
డల్లదే। వచ్చిన దేవకోటి శిశు • పాల జరా సుతులన్ గ
లంచి నీ। యిచ్చెముఁ దీర్ప మెచ్చె; హలి • యున్ ద
యచేసి, బలంబుఁ గూర్చెకే; నా। కచ్చపుఁ గల్మినిచ్చె భు
వ • నావన శీలుఁ డదెంత పుణ్యమో!

రుక్మి—(లజ్జా సంతోషములు ముప్పిరిగొనఁ జేతులు జోడించు
కొని) మహాత్మా,

ఉ॥ నా కగు పెన్నిధానమును, • నాదగు పుణ్యతపః ఫలంబు
నున్। లోక మనోజ్ఞమూర్తి, గుణ • లోక ప్రభాకర శా
ల్విఁ జూపి నన్। జేకొను నట్లు చేసితిరి; • నేఁ దమకేమి
యొనర్తు? నంజలిన్। జేకొనవే మహాత్మ, తమ • శిష్యను
నాదరణంబు పెంపునన్.

(అని వంగి అగ్నిద్యోతనుని పాదములకు నమస్కరించును)

అగ్ని—(సంతోషముతో) శీఘ్రమేవ శ్రీకృష్ణ కర గ్రహణ
ప్రాప్తిరస్తు. (అని ఆశీర్వదించును)

(అంత ప్రేమలత నవ్వుచుఁ బ్రవేశించును)

ప్రేమ—(రుక్మిణిని జూచి) చెలీ, నీ మాటయే స్థిరమైనది. ఇంక రమ్ము. పాపము! నేటి కెనిమిది దినముల నుండియూ చిక్కి సగమైపోవుచుంటివి! (అని అగ్నిద్యోతనుని వైపుఁ దిరిగి) ఇం తెందుకు? ఆ శ్రీకృష్ణునితో మాటలాడుట నాకుఁ దటస్థించినపుడు ఈయవస్థ మా రుక్మిణి కెందుకుఁ దెచ్చిపెట్టెనో యడిగి; అందు కెట్టిశిక్ష విధింపవలెనో యాతని నోట నే పలికించినఁ దీరిపోవును! (అని నవ్వుచు రుక్మిణిని జూచి, మరల నగ్నిద్యోతనునితో) ఇంక పైని బాగుండును గాని; పాప మెంత చిక్కిపోయినదో చూచితిరా?

రుక్మి—(సిగ్గుచేఁ జిఱునవ్వు మొగమున లేని కోపము నభినయించుచు) నీవిచ్చటి కెందుకు వచ్చితివి? చేయుటకు వేరెట్టి పనులును లేవా యేమి?

ప్రేమ—(మఱింత నవ్వుచు) ఓ, లేకేమి? ఇంక ఇక్కడనుండి పనులన్నియు నావే! (అని తెరవైపుఁ జూచి) అదిగో, శ్రీకృష్ణ బలరాములు సభాస్థానమునకు వచ్చుచున్నారు. పని యేదైనఁ జెప్పునోమో శ్రీకృష్ణు నడిగి వచ్చెదనా?

రుక్మి—(లజ్జచేఁ జిఱునవ్వు నవ్వుకొనుచు, మొగము వంచుకొని క్రేఁగంటి చూపులతో శ్రీకృష్ణుని జూడఁబోవును.)

ప్రేమ—(రుక్మిణి శ్రీకృష్ణుని జూడనెంచుటఁ గనిపెట్టి నవ్వుచు నామెతో) శ్రీకృష్ణుఁ డింకెక్కడికిని ఇంత వేగముగ వెళ్లడు లెమ్మ. తనివి తీరఁ దరువాత వారినిఁ జూచుకొన వచ్చును. అమ్మగారు పిలచుచున్నారు. కావున, ముందా సంగతిఁ జూడుము.

రుక్మి—(లేని కోపముఁ దెచ్చుకొని) నీకు మఱి పోవుచున్నదా

యేమి? ఎక్కడపడితే అక్కడే హాస్యములా? వచ్చెదను వెళ్లుము.

ప్రేమ—(నవ్వుచు) అట్లయినఁ గొంచెము శ్రీ కృష్ణునితో మాటలాడి వచ్చుచున్నదని చెప్పుదునా?

రుక్మి—(సిగ్గుచేఁ జిఱునవ్వు మొగమున) ఆఁ! అలాగుననే చెప్పుము. పొమ్ము.

ప్రేమ—పోయెదనా? (అని నవ్వుచు) అవును; ఇప్పుడు నేనేల? అందుకే పొమ్మనుచుంటివి కాఁబోలు! (అని లేనికోప మభినయించుచు) మాటాడినఁ బొమ్మనెదవేమి? పెండ్లయి నంత వరకైన నుండవలెనా వద్దా? అంతయుఁ దీఱిపోయిన వెనుక నన్నవతలకు జూడఁ బెట్టెదవని నాకు తెలియును. (అని అగ్నిద్యోతనుని జూచి నవ్వుచు) ఏదో ఇంతకుఁ ద మరు కటాక్షించి ఆ మహాత్ముని దీసికొని వచ్చితిరి గాని; లేనిచో, మధ్య నేనిబ్బంది పడిపోవుదును. (అని రుక్మిణిని జూచి) కొంచెము వేగముగ మాటలాడుటఁ గానిమ్ము. సెలవుఁ దీసికొనియెదను. (అని నవ్వుచు నిష్క్రమించును.)

అగ్ని—(రుక్మిణిని జూచి నవ్వుచు) అమ్మా, దానితో నీకేమి పోనిమ్ము. హాస్యములాడుటకుఁ బ్రేమలత పుట్టినిల్లువంటిది. నాకింక వేళ కావచ్చుచున్నది. కావున, నీవింక లోనికిఁ బోయి సంతోషమున నుండుము. సెలవుఁ దీసికొనియెదను.

రుక్మి—(సిగ్గుతో) చిత్తము. నమస్కారము. (అని నమస్కరించి యొకవైపునుండి నిష్క్రమింప, అగ్నిద్యోతనుఁ డింకొక తట్టునుండి నిష్క్రమించును.

(యవనిక జారును.)

గద్య

ఇది శ్రీసీతా రామచంద్ర చరణారవింద సేవా సమాసాదిత సరససాహిత్య కవిత్వ వైభవ పరాశరసగోత్రోద్భవ గన్నవరపు వంశాంభోధి పవిత్రచంద్ర వేంకటేశ్వర పౌత్ర, నారసింహేశ్వర పుత్ర, సూరమాంబా గర్భశుక్తి ముక్తాఫల సూర్యనారాయణ మూర్తి ప్రణీతంబైన "రుక్మిణీపరిణయ" మను నాటక రాజమున తృతీయాంకము సమాప్తము.




సిల్కువంటు మజిలీసును వాడుడు.

అందమగు డోర్యాలు!! ఈధర కొద్దిదినములు మాత్రమే!!!
ఒక్కసారి ఆర్డరొసగి చూడుడు!!

| | | |
|---|---|---|
| 6 కమీజులకు 12 గజముల తాను 1కి ధర | | రు 7—8—0 |
| ఇమిటేషన్ చకరసాన కెంపులు 14 కి ... | | రు 4—0—0 |
| పుష్యరాగములు ... | 14 కి ... | రు20—0—0 |
| వైక్రాంతములు ... | 14 కి ... | రు 2—4—0 |

బి. కృష్ణమూర్తిగుప్త, బరంపురం, (గంజాం)






శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీ పరిణయము



## చతుర్థాంకము—ప్రథమ రంగము

స్థలము—పెండ్లి విడిది

(శిశుపాల జరాసంధులు, మరి ఇరువురు రాజులు ప్రవేశింతురు)

శిశు—(కోపముతో) చూచితిరా! కృష్ణుని వెన్నంటి భూమి నున్నినట్లు ఎందఱు వచ్చిరో! వాఁడొక విష్ణ్వంశ సంభూతుఁ డఁట! గొల్ల కులమునఁ బుట్టియు భూభార మడఁపఁ బ్రయత్నించునఁట! లోక ప్రసిద్ధులగు మహావీరులందఱు వాని చేతనే యడగఁద్రొక్కఁ బడుచుండిరఁట! వీఁడే గొల్ల కులమునఁ బుట్టి, ఏ మహావీరుని నేలపాలు చేసెనో చెప్పుకొనుటకు సిగ్గు లేకున్నది కాఁబోలు!

ఉ॥ పౌరుష మింత లేక, నిజ • భంగము లెంచక, గౌరవార
మున్। బోరుల గెల్వలేక, నిజ • భూమిఁ దలంపక, సంద్ర
ముందునన్। జేరిన పంద వీఁడు; ధర • నీధవుఁ డంట!; మ
హాత్వ తత్వ దీ। ప్తారతుఁ డంట! వింటిరె ప్ర • గల్భము
లాతని వెట్టులుండెనో!

ఇంతకును వాని ననవలసినపని యేమున్నది? దొరకినప్పుడెల్లఁ జే తులార వానిని విడిచిపెట్టు మనలను మనమే నిందించుకొన వలసియున్నది. (అని మరింత కోపముతో) అయినను నీకు పరాక్రమ వంతులగు రాజాధిరాజులతో నేమిచూచుకొని తెల పడుచుండెనో తెలయుకున్నది! బ్రతికెను బ్రతుకా గోవుఁ గాచుకొనుట! పరివర్తనమూ స్త్రీజనముల మధ్య! నిలబడి సం పదుటకా పౌరుషము సున్న! ఇట్టి వీనికి యుద్ధ కార్యములతో నేమిపని యున్నదో!

ఉ॥ తానొక రాజుపోల్కి వసు • ధావరు లందు మెలంగఁజూ చుచున్। వీనికి వానికిన్ బగలు • పెట్టుచు నంతటి తోడఁ జోక, యే। దానికినైన ముందునకుఁ • దాని మహాత్ముని రీతి వచ్చు! ఇం। తేనియు సిగ్గు లేదు ధర • నీశ్వరు లందుఁ బరాక్రమింపఁగన్!

జరా—ప్రస్తుత మీవిషయమున కేగుఁగాని; కృష్ణునీ వివా హామునకుఁ బిలచుటకు భీష్మకుని కతనితో నెట్టి సంబంధ మున్నదో నీకు తెలియునా?

శిశు—(అసూయతో) సంబంధమున కేముండును? వానిని ఒక రాజుగా భావించుకొని మర్యాదకై పిలిచి యుండ వచ్చునని నా యభిప్రాయము.

రా॥ ఒ॥ (జరాసంధుని జూచి) ఆ శ్రీకృష్ణుని యాటోపముఁ జూడఁగా మర్యాదకై వచ్చినట్లు కాక; ఏదోయొక దురుద్దే శము తోడనే అంత బలమును వెంట నిడుకొని వచ్చెనని తోఁచుచున్నది! అదియును గాక, రుక్మిణీ హృదయము

గూడ శ్రీకృష్ణుని యధీనమం దున్నదని వాకుక. పై సంగతు లెట్లు పరిణమించునో తెలియకున్నది.

రెం రా॥ (మొదటి రాజుతో) మీకేమి పిచ్చిభ్రాంతి పుట్టిన దేమి? జగదేక వీరుఁడగు మన మగధేశ్వరుని మ్రోలనే ఆ శ్రీకృష్ణుని యాటోపమా? జరిగిన పరాభవము లన్నియు ఇంతటితోడనే మరచిపోవుటా?

గీ॥ ఒకటియా, రెండ! ఇరువది • యొక్క సార్లు
మన మహారాజుతోఁ బోరి • జనన కాల
పుణ్య వశమునఁ బ్రాణముల్ • పోవ కుండఁ
బ్రతుకఁ దప్పించు కొనుచుండు • వాఁడె వీఁడు!

వీని పౌరుష మెవరికిని దెలియనిది కాదు. ఒకవేళ వాఁడా యుద్దేశము తోడనే వచ్చిన యెడల వాని బ్రతుకింతటితోఁ జల్లారక మానదు.

శిశు—(మహా కోపముతో) చల్లారుటయా? వాఁడంతమట్టుకే సాహసించిన యెడల ఈ లోకమున వాఁడుండుననుమాట యబద్ధ మనుకొనుము.

ఉ॥ కావర మెక్కుడై, పసుల • కాపరి బుద్ధిని జూప నెంచుచో। నావిధి కాక్షణంబె ప్రళ • యాంతక రీతిని వానిఁ బట్టి, భూ। మీ వరులెల్ల మేలన ని • మేషమునన్ దలఁ ద్రుంపకుందు నే!। శ్రీవరుఁడేమొ వాఁడు? తన • చేవ మదెట్టిదో చూపనిమ్ముఁ కన్.

జరా—(శిశుపాలుని జూచి) ఓయీ, నీకు మతిపోవుచున్నదా

యేమి? పిరికి పంద యగు వాఁడేమి; సాహసముఁ జూపించు టేమి?

శా॥ వాఁడే వేటిమగండు నైన మనలన్ • వారించి పోరాడఁ
డే?। రాఁడే శూరుఁడు శౌర్య ముండినను? సం • గ్రామం
బుఁ గావింపఁడే?। కీడున్ మేలును వానికిన్ దెలియవే? •
కీడెంచ మేలుండునే?। వాఁ డేసాహస మూనువాఁడు మన
తోఁ • బ్రాణంబు తీపుండదే?

ఒకవేళ వాఁడటులనే పరాక్రమించిన యెడల యాదవ కుల మన్న మాటయే భూమిపై నుండదనుకొనుము. ఈ జరాసంధు నింకను బోల్చుకొనకున్నచో ఈసారి తప్పక తెలిసికొనఁగలఁడు.

శా॥ ఏ లోకంబున దాగినన్ సరియె; దే • వేంద్రాది దిక్పాలు
లే। యే లోకంబుల నడ్డినన్ సరియె; యే • దిక్కేని వాఁ
డిమ్మేడన్। బోలన్ జూపిన మత్కఠోర శరత్రి • పున్
జేసి ప్రాణంబులన్। దూలన్ జేయని నా పరాక్రమము
నె • దున్ గల్పనో చెప్పుమా?

శిశు—(ఇంచుక అనుమానముతో) అంతమట్టుకు నిజమే. కాని, వీనినుండి పెండ్లికేమైన భంగము కలుగునేమోయని యాలోచించు చుంటిని.

జరా—(కోపముతో) ఏమీ? పెండ్లికి భంగమా? అంతపాటి మొనగాఁ డెవఁడు?

చ॥ నిమిసము తేఱిచూచుటకు • ఈ భువనత్రయి మెంతో
లేదు, నన్। సమరములోన నిల్పి శర • జాలముఁ జూపిన
ధీరుఁ డుండెనే?। భ్రమ యిది కాని, యాదవుఁడు • లా

వ్వును జూపుట; అందుపైనిఁ గా। ర్యమునకు భంగపా
టగుట ♦ అంతయుఁ జిత్రమె చాలుఁ జాలిఁకన్.

కావున, నీవా విషయమై యెట్టి సంకోచమును బూన నవస
రము లేదు.

మొ॥ రా॥ (శిశుపాలుని జూచి) ఆర్యా, ఎన్నడు లేనిది మీరీ
పిరికిదనము వహించు చుంటిరేమి? ఆ శ్రీకృష్ణుని బల
పరాక్రమములు మీకు తెలియునివా యేమి?

చ॥ రణమున వెన్నఁజూపు భుజ ♦ రక్తిమఁ గల్గిన ధైర్యశాలి
వాఁ। డనిని బరాక్రమించుటలు, ♦ ఆవయిఁ బెండ్లికి భంగ
మాటలే!। కనుఁగొన దేవదానవ ని ♦ కాయము లెల్లఁ గ
డంగి నిల్చినన్। మన మగధేశ చంద్రునకు ♦ నాలమునం
దజయంబుఁ గల్గునే?

(తెరలోఁ, గోపముతో) ఓరోరి వాచాటా, అమంగళప్రలాపీ,
యెవఁడవురా నీవు?

చ॥ కనుఁగొన దేవదానవ ని ♦ కాయము లెల్లఁ గడంగి నిల్చి
నన్। మన మగధేశ చంద్రునకు ♦ నాలమునం దజయం
బుఁ గల్గునే!। యనుచు దురాత్మ, యెవ్వఁడవు ♦ రా పలు
కాడుచు నున్నవాఁడవీ। ఘన నిసితాసి నిన్నుఁ గడికంబలు
గోసెదఁ గాచుకొమ్మిఁకన్.

జరా—(విని, అనుమానాశ్చర్యములతోఁ జిన్నపోయి తనలో)
అమంగళ మసుగంటుఁ గాక! (అని మొదటి రాజును జూచి
ప్రకాశముగా) ఓయీ, నీవిప్పు డాడిన మాటలన్నియు అ
మంగళములనే సూచించు చున్నవి సుమా!

(అంత ఖడ్గపాణియై కౌద్రిముతోఁ బూర్వ పద్యమును జదువుచుఁ రుక్మి ప్రవేశించి, జరాసంధాదులను జూడకయే)

రుక్మి—ఓరీ, దురాత్మా, అమంగళ ప్రలాపీ, ఎక్కడ నుంటివి రా? (అని నలువైపులఁ గలయఁజూచుటలో జరాసంధాదులను జూచి, ఆశ్చర్యముతో) దేవా, నమస్కారము. (అని జరాసంధునకు నమస్కరించును.)

జరా—(లేని సంతోషముతో రుక్మిని కౌఁగలించుకొని ఆసనముపైఁ గూర్చుండఁజేసి యూరకుండును.)

రుక్మి—(జరాసంధుఁ డట్లుండుట కనుమానమందుచు నటనించి) దేవా, ఇప్పు డెవ్వఁడో యమంగళములను బలుకుట విని వచ్చుటచేఁ దమరును వినియుందు రనుకొనియెదను.

జరా—(చిన్నబోవుచు మొదటి రాజును జూచి) అవును. ఆ మహాత్ముఁ డతఁడే కాని; అతని ననవలసిన పని యేమున్నది?

రుక్మి—(కొంచెమునే పూరకుండి) వేయిసెల్ల చేసినా యిట్లు తగులుబడుట? ఇటువంటి మాటల చేతనే కార్యము లైన మరేమున్నది? తమరింత సంకోచ మీపాటి దానికే చూపవలయునా?

చం॥ అని మొన దేవదానవ స ♦ హస్రము లొక్కట నెత్తి వచ్చినన్। మనమునఁ గొంకులేని యస ♦ మాన పరాక్రమ సింహులైన మీ। ఘన భుజశక్తి నోర్చుటకుఁ ♦ గల్గునె యీ పదునాల్గు లోకముల్। జనవర! అట్టి బాహుమద ♦ సంశయ మందఁగ నేల నీగతిన్?

జరా—సంకోచమున కేమియును లేదు. అకారణమున నతని నోటినుండి యీమాట వచ్చినందుల కించుక యోచించు చుంటిని.

రుక్మి—దేవా, ముల్లోకములు దండెత్తివచ్చినను ఓటు వహింపని తమబోటి పరాక్రమ వంతుల కాపాటి మాట వలన నేమగును?

శిశు—అగునని యీ యిప్పుడు? పిరికిపంద యగు ఆ యాదవుఁడు చేసిన దేమి; మన కయిన దేమి? అట్టి సంకోచ మెన్నటికిని లేదు.

రుక్మి—అదియే కావలసినది. లేనిచో, సెలవిచ్చితిరేని యిప్పుడే యీ మూర్ఖుని యమ సదనమునకంపి వచ్చెదను. (అని జరాసంధుని జూచి) దేవా, సెలవిప్పించెదరా?

గీ॥ ఇపుడె తమయాజ్ఞఁ దలఁదాల్చి ♦ యేను బోయి,
యాదవుని జేరి, సమర వి ♦ ఖ్యాతిఁ జూపి,
భూమి యదువంశ రహితమై ♦ పొలుచు నట్లు
జేసికొని వత్తు నాజ్ఞ ని ♦ చ్చినను దేవ!

జరా—(సంతోషముతో రుక్మి చేయిఁ బట్టుకొని) నీ వంతటి వాఁడవే యగుదువు గాని, యిప్పుడుమాత్ర మట్టిసాహసము వలదు ఆవిషయమై పెండ్లయిన వెనుక జూచుకొనవచ్చును.

రుక్మి—పెండ్లికిని దీనికిని సంబంధ మేమున్నది? వానిని జంపినచో నన్నెవ్వరైన నడ్డెదరని యూ సంకోచించు చుంటిరి?

జరా—అటులని కాదుగాని; ప్రస్తుతమీ విషయమున కిది తగిన సమయము కాదని నా యభిప్రాయము.

రుక్మి—సరియే; కానిండు. ఇప్పుడు మాత్రము మించిపోయిన దేమున్నది? తమ దయవలన వాఁడీదినమున సదృష్టవంతు డయ్యెను. గాని, మరల నెప్పటికైన నా చేఁజిక్కక మానఁడు, అప్పుడే చూచుకొనియెదను.

జరా—(నవ్వుచు రుక్మి భుజముపైఁ దన చేతితోఁ దట్టుచు) నీ ధైర్యము నాకుఁ జాలసంతోషముఁ గలిగించుచున్నది. (అని శిశుపాలాదులను జూచి) మనకింక వేళ కావచ్చినది. గావున లోనికిఁ బోవుదము రండు. (అని లేచి అందఱితో నిష్క్రమించును.)

(యవనిక జారును.)

---

## కేతకీ ఖారా మసాలా

పుష్పములలో నెల్ల కేతకీపుష్పము సర్వజనానందకరము. అట్టి పుష్ప వాసనతో నెల్లప్పుడును మనోజ్ఞముగా నుండు నట్టి యీ కేతకీ ఖారా మసాలాను గూర్చి విస్తారము చెప్పనక్కర లేదు. ఇదివర కెందరెందరో తయారుచేసి అమ్ముచున్నది సామాన్యపు ఖారామసాలా. ఇపుడు మావద్ద "పుష్పరాజము" అనదగిన కేతకీపుష్పవాసనలతో రుచికరముగ వెనుకటి మసాలాల నెల్ల తలదన్నునటుల తయారుజేసి అమ్మకమునకు సిద్ధముగా ఉంచితిమి. శేరు 1కి రు 0—7—0 లు ఒక్కసారిపరీక్షింపుడు.

జామి కృష్ణమూర్తి సుబుద్ధి, కేతకీ ఖారా మసాలా
మర్చెంటు, బరంపురం, (గంజాం)

స్థలము—పురవీధి

(సూర్యారాయ శర్మకవులిరువురు చెరియొక వైపునుండియుఁ బ్రవేశించెదరు)

శర్మ—(సూర్యారావును జూచి) ఓహో! సూర్యారావా! ఎక్కడికిలాగు? మంచిసమయంలో కనబడ్డావు. నీతో కొంచెం మాట్లాడాలి నిలబడతావా?

సూ—చిత్తం. మాట్లాడండి. ఏఁవిటీ సంగతులు?

శర్మ—ఏమీ లే... ఈరుక్మిణీదేవి వివాహం కాదుగాని మధ్య ప్రాన్లో వున్నవాళ్లందరూ చాలా యిబ్బంది పడిపోతున్నారు. అబ్బబ్బ! ఈ పెళ్లెంత వేగం అయిపోతుందో గాని—

సూ—(నవ్వుచు) స్వామిగారూ, నీచెంప కొడితే నాకళ్లు జిగేలు మన్నాయన్నట్లు రుక్మిణీదేవికి వివాహమైతే మధ్య మీ కేఁవిటా యిబ్బంది?

శర్మ—(కోపముతో) ఇబ్బందేఁవిటని మెల్లిగా అంటున్నావేమిటి? సంసారం లేనివాడవు నీకంత బాధ లేదేమోకాని; పెళ్లాం పిల్లలు గలవాళ్లందరికి చాలా యిబ్బంది గానే వుంటుంది.

సూ—(నవ్వుచు) కవిగారూ, కోపం పడకండి గాని, ఉంటే మాత్రం వచ్చిన బాధేమిటండీ? ఈమాట మీ నోటంటే విన్నాను గాని, ఇందరి జనంలో ఎచ్చటా వినలేదు.

శర్మ—(విసుగుతో) ఒకే, వాళ్లందరి కేమో గాని, నాకు మాత్రం చాలా యిబ్బందిగా వుంది. చూశావా, మొండ

తెలాగున్నాయో? నూతిలో నీళ్లు లేవు. వాడుకొనుటకైన నీరంతా పైనుంచి తెచ్చుకో వలసిందే. పడినవాళ్లుంటారు. పడనివాళ్లుంటారు. అందులో సైనికులసంఖ్య చెప్పనలవి కాదు. నీవు బాగా చూడలేదేమో గాని: ఆ శ్రీకృష్ణుని వెంటవచ్చిన యాదవులేచాలును నేలయీనినట్లు వచ్చేరు.

సూ—(నవ్వుచు) అయితే స్వామిగారూ, దానికేమి చేస్తాము గాని; కృష్ణుడంత బలముతో వచ్చుటకు కారణ మేమైన మీ యాలోచనకు తట్టిందా?

శర్మ—(అసూయతో) పోనిస్తూ, కారణ మేఁవిటి మంచి గెడ్డలు.

సూ—అయ్యో,| మీ తెలి వంతాలోనే వుంది. లేక పోతే లోక రక్షకుడగు అతనికి పటాటోపముతో పని యేఁవిటి ఉంటుందండీ?

శర్మ—(విసుగుతో) పోనీ, యెందుకో తెచ్చుకున్నాడనుకుందాం గాని, ఇందరురాజులు వచ్చేరుగదా ఒకరినేనా కలుసు కున్నావా లేదా?

సూ—(నవ్వుచు) ఏదానికో సెలవిస్తే వెళదామని ఉంది.

శర్మ—ఏదాని కంటా వేమిటిరా? కవీశ్వరులముగదా మనకీ, మన గ్రంథమాలలకు ఏమైనాసాయం చేస్తారేమో అని ఆశ.

సూ—(నవ్వుచు) స్వామిగారూ, మన కేమిటి; గ్రంథమాల లేఁవిటి పోనిస్తురూ. అదిగాక, ఈ ఈకాలంలో కవిత్వం, గ్రంథమాలలు అన్నీ బాగానే వున్నాయి. చూశారా? ఏదో పూర్వజన్మ వాసనచేత రసం, ధార, చమత్కారం

లేకపోయినా వంకరటింకరగానైనా పద్యమల్లడ మొకటి వచ్చింది కాబట్టి, దానిచేతనైనా నోరార భగవంతుని స్తోత్రించేసి జన్మసాఫల్య మొందకుండా ఇచ్చినవారిని పొగడి, ఇవ్వనివారిని తిట్టి పుస్తకాలు వ్రాయడమేఁవిటండీ? మీ రేమనుకుంటే అనుకోండి గాని, మీబోటి మహనీయుల నుంచి ఇచ్చేవాఁడు కూడా నాబోటివాడు కంట పడడమే తడవు, "బాబూ, మీ కవీశ్వరులకొక దండం, ఇక దయ చేయండ" ని అంటున్నారు. పూర్వం ఎవరో మహాత్ముడు చెప్పినట్లు ఇప్పుడింటికి నూరుమంది కవులు! యతి, ప్రాస, గణమేనా తెలియదు. వ్యాకరణంఅంటే యేమిటో! ఇంక అహంకారం చూస్తే యీ పద్ధాలుగులోకాలు మరిపట్టవు. మహాత్ములను నిందించడానికా వెనుకతియ్యరు! పద్యమల్లడానికి ప్రారంభిస్తే పాతికరోజులు! అదేనా తిన్నగాఉంటుందేమో అంటే నూరు తప్పులు! ఓహోహో! ఏమి కవిబ్రహ్మలను సృష్టిస్తున్నాడయ్యా, ఈపాడు కాలంలో ఆ బ్రహ్మదేవుడు! వాడీటన్నాదియ్యా, ఎందుకిలాగు పుట్టించేస్తున్నాఁడో గాని; వాడిమీదవీడు, వీడిమీదవాడు; భగవద్గీతలలోకూడా తప్పులెంచడమే! ఏమి కలియుగ విచిత్రకవిపటాలమురా బాబూ! "కవిగారూ," అని పిలవని వాడిమీదల్లా ఒకపద్యం! ఇరవై రోజుల్లో నూరు పుస్తకాలు దగ్గిర పెట్టుకొని మూడు యతి తప్పులతో, నాలుగు గణభంగములతో, పదిపుంజీల వ్యాకరణ దోషాలతో వ్రాత ముగించేసి కనపడ్డవాడికల్లా "చూశా, ఎలాంటిటుమికీ కొట్టేనో వాడిమీద" అని చదివి వినిపిస్తూ, ఏదో ఇంత ఆడ

వాళ్లు పోస్తున్న గంజినీళ్లు తాగుతూ, సాయంకాల మయ్యే సరికి వీళ్లు, బేట్లూ, క్రాఫింగులూ, ఓహోహో! ఏమి కవిత్వాలు బాబూ, ఆకవిత్వాలకుతోడు నిరుద్యోగం డిపార్టుమెంటు మేనేజర్లమైనమనకు కోతికి కొబ్బరికాయదొరికినట్లు గ్రంథమాలొకటి దొరికితే మరి అడగనా ఆ గ్రంథమాల సౌభాగ్యం! చాలించండి స్వామిగారూ, ఎవళ్లైనావింటే నవ్వుతారు! మరేదేనా ఉంటే సెలవిప్పించండి. నాకీ సంగతి చెప్తే తలనొప్పివేస్తుంది. ఈ కాలంలో ఎవడేనా మహాత్ముడగు కవీశ్వరుడున్నాడంటే అతని పరువు కూడా పోతుంది!

శర—(కోపముతో) అయితే నువ్వన్న మాటేవిటి?

సూ—ఏమీలేదూ. వాళ్లందరిదగ్గిరకు వెళ్లి యాచించుకొనుటకన్న మనకున్న యీకవిత్వంముక్కలతో లోకరక్షకుడగు శ్రీకృష్ణ భగవానుని పాదదర్శనము చేసికొని నోరార ఆ మహాత్ముని స్తోత్రించేస్తే జన్మైనా సార్థక మవుతుందని నా అభిప్రాయము!

శర్మ—నీ పద్యాలప్పుడే వ్రాసుకొని సిద్ధంగా వున్నావా మేవిటి?

సూ—(నవ్వుచు) బాబూ, మీధర్మమంటూ చచ్చిచెడి శాయంగల విన్నపములుగా పాతికరోజులకేనా పద్య మల్లలేని దురదృష్టం నాకు పట్టలేదు. ఎక్కడేనా పొరపా టుంటే పెద్దలగువారు దిద్దుతారుగాని; గంటకేభై పద్యములు నిరాఘాటంగా చెప్పేదారుఢ్యం నాకుంది. కాబట్టి ముందు మీ సంగతి ఆలోచించండి.

శర్మ—అలాగైతే నీవెంట రాలేను. అథవా అయిదు పద్యాలేనా చెప్పవద్దా? ఇప్పుడింటికివెళ్లి ప్రారంభిస్తే తప్పుల మాటకేమి, రేపు రుక్మిణీదేవి లగ్నంవేళకు పూర్తికావచ్చునని నా నమ్మకం. అదిగాక, ఆసరికి అక్కడికంతా చేరుకుంటారు. శ్రీకృష్ణుడుకూడా అక్కడే వుంటాడు. అప్పుడు మనంవెళ్లి ధాటీగా పద్యాలు చదివేమంటే అక్కడున్నవాళ్లంతా మనల్ను కవీశ్వరు లనుకుంటారు. పేరు కూడా నస్తుంది.

సూ—సరే! మీరా లగ్నానికివెళ్లి పెళ్లిపీనెకాపద్యాలు చదివి వినిపించాలి. రావయ్యా, పిచ్చిబ్రాహ్మడా, కావలిస్తేనేను నాలుగు పద్యాలు వ్రాసిస్తాను. భగవంతుని దర్శించుకొని సంతుష్టిగా ఆపద్యాలు చదవనయ్యా! జన్మేనా సార్థకమగుతుంది. వెధన కడుపు నెవ డడుగుతాడు?

శర్మ—(కోపముతో) ఏమిరోయ్! మించిపోతున్నాదే మాటల వైఖరి? నీవు వ్రాసిస్తే నేను చదివీదా? మతి పోతున్నాదా యేమిటి? పెద్దా, చిన్నా తారతమ్యం అక్కర లేదూ? చూడూ? ఆ పెద్ద గుడ్డ శాస్త్రి నావిషయంలో యెంత మెచ్చుకుంటూ వుంటాడో! నన్ను సాక్షాత్ అపరవ్యాసునిగా భావించుకొని పానగొట్టాం లాంటి మహాత్ముడు

కూడా నాపద్యాలంటే చెవికోసుకొని మరీ వింటాడు!

సూ—(నవ్వుచు) స్వామిగారూ, పెద్దా చిన్నా తారతమ్యం ఉంటే మనకీ గ్రహచారమెందుకు వస్తుందిగాని; సెలవిప్పిస్తారా, నేనుపోయి ఆ శ్రీకృష్ణుని పాద దర్శనము చేసుకొని వస్తాను.

శర్మ—వెళ్ళుదువుగానిలే. తొందరేమిటిగాని; కాకి ముక్కుకు దొండపండు కట్టినట్లు రుక్మిణీదేవిని శిశుపాలునికిచ్చి వివాహము చేయుచున్నారేమిటి?

సూ—(నవ్వుచు) అయ్యా, మీా కుపిచ్చి పట్టిందేమిటి? శిశుపాలునికి పెండ్లేమిటి? అందుకేనా సంభావనకు వెళ్ళినట్లు లగ్నంవేళకు పద్యాలు పట్టుకొని వెళతామంటున్నారు?

శర్మ—(కోపముతో)ఒరే, మాటమాటకీ వికటమే? తెలుస్తే చెప్ప కూడదూ? శిశుపాలునికి కాకపోతే మరెవరికిచ్చి పెళ్ళి చేస్తారు?

సూ—శర్మగారూ, అయితే చెప్తాను వినండి. మీాకు కొంచెమేనా ఆలోచనశక్తి లేదు. మహాత్ములను నిందిస్తూ అహంకారం పడడానికితప్ప మీారెండుకూ పనికిరారు. విన్నారా? శిశుపాలునికి పెండ్లి; మనకు కవిత్వం; ఈ రెండూ ఒక్కటే. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని తీసుకొని వెళిపోక మానడు?

రాజులందరు యుద్ధంచెయ్యక మానరు. కృష్ణుడందరికి అవమానం కల్పించక మానడు. ఇంతే సంగతులు. తెలిసిందా? మళ్లీ చెప్పాలా?

వర్మ—(కోపముతో) పోరా; ఎక్కడి మాటలు! లోకమంతా కన్నం పడిపోతుందంటావు! ఒక్కటైనా నమ్మకం కల్గేటట్లు చెపితే!—

సూ—(చికాకుతో) అయితే చద్దికుండదగ్గర వెళ్లికూర్చోండి. నేనుపోయి శ్రీకృష్ణుని దరిశనము చేసుకొని వస్తాను. సెలవు. (అని నిష్క్రమించును)

వర్మ—(కోపముతో మొగము ముడుచుకొని) ఇలాంటి గుంట వెధవలతో మాటలాడడం నాదే తప్పు. నా కవిత్వానికి నా పాండిత్యానికి మా గురువు ద్రోణాచార్యుల వారికి పద్యంసంగతి తెలియకపోయినా ధాటీగాచదివేసరికి మరిగిన నేతిలో వేసిన పూరీ పొంగినట్లు పొంగిపోతాడు. ఆడదైతే నేమి; వారింటిపొరుగున ఉన్న ఆ కలియుగసీతామహాలక్ష్మి నాపద్యాలువిని ఎంత లోలోపల సంతోషిస్తూ ఉంటుందో నాకే తెలుసును. ఇలాంటివాళ్లు అనుకుంటే ఎంత; అనుకోకపోతే ఎంత? నిష్కారణం ఇంతసేపు వృధాచేసేనుగాని; వీధికెదురుగుండా సందుగుపెట్టె దగ్గిర పెట్టుకొని వీధిని పోతున్న వాళ్లందరిని చూస్తూ ఆలోచించుకుంటూ వుంటే ఒకపద్యం అల్లడానికితగిన భావంలో కొంతేనా ఆలోచించుకొని యుందును. ఇంకనైనను వేగంవెళ్లి రేపటిలగ్నంవేళకు ఐదుపద్యాల కేసాటి చూడాలో నాలుగో తక్కువైనా వే

గంగా వ్రాసేస్తే ఆపైని యేమేనా లాభం ఉంటుంది. వెళతాను. (అని నిష్క్రమించును)

(యవనిక జారును)

గద్య

ఇది శ్రీసీతా రామచంద్ర చరణారవింద సేవా సమాసాదిత
సరససాహిత్య కవిత్వ వైభవ పరాశరసగోత్రోద్భవ గన్న
వరపు వంశాంబోధి పవిత్రచంద్ర వేంకటేశ్వర పౌత్ర,
నారసింహేశ్వర పుత్ర, సూరమాంబా గర్భశుక్తి
ముక్తాఫల సూర్యనారాయణ మూర్తి ప్రణీతం
బైన "రుక్మిణీపరిణయ" మను నాటకరా
జమున చతుర్థాంకము సమాప్తము.

---


## ఆర్త రక్షామణి

ఇదియొక భక్తిరస ప్రధానమైన శతకము. ఇందలి ప్రతి పద్యము ముద్దులు మూటఁగట్టుచుండు శైలిలో మనోహరముగ నుండునట్లు మ॥ రా॥ గన్నవరపు సూర్యనారాయణ మూర్తి కవిగారిచే రచింపఁబడి అప్పుడే రెండవకూర్పున నున్నది. వెల రు 0—4—0 లు మాత్రమే.

సెక్రెటరీ,

ఆంధ్ర భారతీ గ్రంథాలయము,

బరంపుర, (గంజాం జిల్లా.)



శ్రీమత్పరదేవతాయై నమః

# రుక్మిణీ పరిణయము

పంచమాంకము — షష్ఠమరంగము

స్థలము — పెండ్లి విడిది

(బలరాముఁడు ప్రవేశించును)

బల — (తనలో) శ్రీకృష్ణుని కోరిక ప్రకారము మా యాదవ సైన్యములన్నియు బారులు దీర్చుకొని సిద్ధముగనుండునట్లు చేయవలసినదని అక్రూరసాత్యకుల నింతకుముందే పంపించి వచ్చితిని. వారును నేఁ జెప్పిన చొప్పున నిప్పటికి సిద్ధముఁ జేసి యుందురు. (అని తూర్పు వైపుఁ జూచి) అయిన నింకను సూర్యోదయ మగుటకు గంటకాలము పైనిఁ బట్టును గాని; కృష్ణుఁడీసరికి నిద్రనుండి లేచిన బాగుగ నుండును. (అని కొంచెము సేపూరకొని) ఇప్పుడుమాత్రము మించిపోయిన దేమున్నది?

(అంత సాత్యకి ప్రవేశించి, బలరాముని జూచి)

సాత్య — అన్నయ్యా, మీరు చెప్పినట్లు సైన్యములన్నియు సిద్ధముగ నుండునట్లుచేసి అక్రూరు నచ్చట నుంచి వచ్చితిని.

(తెరలో)

శా॥ ఏ నీ రూపము విశ్వమోహనమునై, ఈ సృష్టివైచి
త్రికిన్। దానై, కన్నుల పండువై, విమల సత్వ స్థాన
మ్మౌ, దివ్యమై।, జ్ఞానుల్ మెచ్చెడు కల్ప వృక్షమునునై,
సత్యంబునై వెలునో। ఆ నీ రూపముఁ జూప మేలుకొను
కృష్ణా, దేవకీ నందనా.

సాత్య—(విని, సంతోషముతో) మేలు వైతాళికా, మేలు!
సృష్టిస్థితి లయకారకుఁడగు భగవంతుని దివ్యతేజము ప్ర
కృతము నీవు వర్ణించిన వర్ణనకనువుగ నున్నది! జగదంత
ర్యామియు, సర్వలోక వ్యాపకుఁడు నగు శ్రీకృష్ణు ననవర
తమిట్లు ధ్యానించు నీజన్మమే సుమా జన్మము!

(అంతఁ బఱచుకొనిన బట్ట, తలగిడ చంకను బెట్టుకొని కళ్లు
నులుము కొనుచు విదూషకుఁడు ప్రవేశించును)

విదూ—(చంకనున్న బట్టల నొకచోటనుంచి, ఆవులించుచు)
అబ్బబ్బబ్బబ్బ! ఈ అల్లరముండకొడుకులీ వైతాళికులెచ్చట
నాపాలిటి మృత్యు దేవతలవలె ఈ శ్రీకృష్ణునికి దొరికిరో
కాని మూడుగంటల రాత్రినుండియు చెవులు గింగురులెత్తు
నట్లు అరచుటకు ప్రారంభించి ప్రతిరోజును నానిద్ర భంగ
ము చేయు చుందురు. వీళ్ల కింత పెద్ద గొంతుక లిచ్చిన
ఆ బ్రహ్మ దేవుని కొంప యెంత తవ్వినా నా దుఃఖము
తీరదుకదా! (అని మరల ఆవులించుచు) అబ్బబ్బబ్బ! నా
కన్ను రెప్పలెంత మీఁదికెత్తుచున్నను లేవకున్నవి! ఏమి చే
యుదును! (అని మరలఁ గనులు నులుముకొనుచు) ఏదో!

ఈ శ్రీకృష్ణునికి పెండ్లవుతుందికదా: షడ్రసోపేతముగా ఇష్టమువచ్చినట్లు తినవచ్చునని వెంటపడితే ఈపిచ్చి ముండ కొడుకులు నిద్రిసాపోని వ్వకుండా తెల్లవారకమునుపే లేచి కొంప మునిగి పోయినట్లు అరుస్తూ వుంటారు. ఇక్కడ వుంటే మరినాకు సౌఖ్యంలేదు. ఆ శ్రీకృష్ణుడు వస్తే అతని పాదములకొక దండం, ఆ పెళ్లిపీనెకు పది దండాలు, ఆ బూర్లు చద్దికి నూరు దండాలుగాని; బాబూ, నా పొడుం గాయ నాకిచ్చి నేను వెళిపోతానని అడిగి పుచ్చుకొని మరీ వెళిపోతాను. వీళ్ల బాధ మరి నేను పడలేను.

సాత్య—(నవ్వుచు, విదూషకుని భుజముపైఁ జేతఁ దట్టుచు) ఓ మొద్దమ్మా, నీకింకను తెల్లవారలేదా యేమి? అదిగో! చిన్నన్నగారు వచ్చుచున్నారు. అటు చూడు.

విదూ—(చూడకయే కళ్లు నులుపుకొనుచుఁ గాళ్లుక్రిందికిఁ గొట్టుచు) బాబూ, ఓయ్ శ్రీకృష్ణస్వామీ, నీ పెళ్లికి వెయ్యి దండాలుగాని; నీపుణ్యా వుంటుంది నాపొడుంకాయ నాకిచ్చి బాబూ, నేను వెళిపోతాను. అబ్బబ్బ! నీకెలాగుందో గాని, ఈ ముండకొడుకు లీ వైతాళికుల నుంచి నా కొక నాడేనా సుఖంగా నిద్ర పట్టకుండా వుంది సరేకదా; మధ్య మధ్య వీళ్లొచ్చి, వాళ్లొచ్చి, "మొద్దూ, దద్దమ్మా," అని పిలుస్తూ నాకల్లర పెడుతూవుంటారు. ఏదో, శ్రీకృష్ణుని వేడుక చెలికాడను గదా; ఇంకా నన్నంతా ఎంత ముద్దుగా చూస్తూ వుంటారో అని గంపెడాశతో మా నాయనమ్మ పెడుతూ వున్న చద్దన్నమేనా తినకుండా వెళిపోవచ్చినందు

కీ అల్లరేమిటి బాబూ? నాకీ యవస్థా వద్దు! ఆ బూర్లు, చద్దీ వద్దు; నా పోడుంకాయ నాకిచ్చేసి నేను వెళిపోతాను. మా వూరు వెళిపోయి హాయిగా చెరువు గట్టుమీద గాలి వేస్తూవుంటే బండరాతిమీద బట్టపరుచుకోని ఇష్టం వచ్చినట్లు నిద్రబోతాను. తే, నా కాయ. (అని చేయిఁ జాపి, కునుకు చుండును.)

(తెరలో నగారా ధ్వనులు.)

విదూ—(త్రుళ్లిపడి, తెలివిఁ దెచ్చుకొని చూచి, ఆశ్చర్యముతోఁ దనలో) ఏఁవిటీ అల్లర! ఇదంతా పెళ్లి పటాటోపమే కాబోలు! బాగుంది! (అని మరలఁ గునుకు చుండును.)

(తెరలోఁ దుపాకిధ్వని)

విదూ—(దద్దరిల్లుచుఁ దొందరగాఁ గ్రిందఁ బెట్టుకొనిన బట్టలను బట్టుకొని సాత్యకిని జూచి) ఏమయ్యా, సాత్యకీ, ఈ శబ్దమేమిటి? ఎవళ్లో అవతల కొట్టుకొని చచ్చిపోతున్నారు కాబోలు! (అని తనలో) ఇక్కడ నేనుంటే నన్నుకూడా చంపేస్తారు. మా అమ్మకు నేనొక్కడినే! మొన్న మా నాయనమ్మ పెట్టిన బెల్లపావకాయ గూనె దుండిపోయింది! నేను చస్తే అదంతా మరెవరు తింటారు? ఈ పెళ్లికి నూరు దండాలు! నే నిక్కడ మరుండను. (అని వెళిపోఁ బోవును.)

సాత్య—(నవ్వుచు విదూషకుని బట్టుకొని) ఓ పిచ్చి బ్రాహ్మణుఁడా, ఎక్కడికి వెళిపోయెదవు? నేనుండఁగా నీకుఁ గలిగిన భయమేమిటి?

విదూ—(గడగడ వడఁకుచు) భయ మేమిటోయ్ నాయనా? నీ కేం, మీ యమ్మకు మీరు ముగ్గురు కొడుకులు, నేనొక్కడనే! నేను చస్తే మా నాయనమ్మ రోజు ప్వార బోస్తున్న చల్దన్నమంతా ఎవరు తింటూ వుంటారు? బెల్లపావకాయంతా ఏ యేట్లో పారేడం? నన్ను వదలీ, నేను వెళ్లిపోతాను. (అని వదిలించుకొనఁ బోవును.)

(అంతః గృష్ణుడుఁ ప్రవేశించును)

సాత్య—(శ్రీకృష్ణుని జూపించుచు) ఓయి మొద్దూ, అదిగో, చిన్నన్నగా రటు చూడు. నీ పొడుంకాయ నడిగి పుచ్చుకొనుము.

విదూ—(శ్రీకృష్ణుని జూచి) నాయనా, కృష్ణమూర్తీ, నీకు పుణ్యం వుంటుంది నా పొడుంకాయ నాకు పారేవోయ్ బాబూ, నేను వెళ్లిపోతాను. నీకేఁవి; నీవు మహారాజులాగు అంతఃపురముమీద హంసతూలికా తల్పంమీద పడుకుంటు న్నావు కాబట్టి నీకు తెలియదు గాని; ఆ నులక మంచం మీద నల్లుల బాధకు, మూడు గంటల రాత్రి కాకమును పే లేచి ఏళ్ల సిగతరగ కంచు గొంతుకలు పెట్టుకొని అరు స్తున్న అల్లర ముండా కొడుకులు ఆ వైతాళికుల అవస్థకు, మధ్య మధ్య ఇటొచ్చి అటొచ్చి "మొద్దూ, దద్దమ్మా," అని సాత్యకిమొదలైన వాళ్లంతా పిలిచే పిలుపులకు నేను భరించలేను. నీపెళ్లికి వెయ్యిదండాలు. కావలిస్తే ఆ రుక్మిణీ దేవివచ్చినప్పుడు నావంతుబూరెలు, చద్దికి డబ్బులడిగిపుచ్చు కొని వండుకొనితింటాను. తే నాకాయ, నేను వెళ్లిపోతాను.

శ్రీకృ—(నవ్వుచుఁ బొడుముకొనుచు నొసఁగి) సరియా; ఇంకే మైనను జెప్పుట మరచిపోయితివా? కొంచెము పొడుముఁ బీల్చి, ఇంకేమైనను మరచినయెడల జ్ఞాపకమునకుఁ దెచ్చుకొను చుండుము. (అని బలరాముని జూచి) అన్నయ్యా, మన మనుకొనిన ట్లన్నియు సిద్ధమైనవి కదా?

బల—సర్వము సిద్ధమైనవి. ఇంకఁ బై సంగతుల కేయాలస్యము.

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుకొనుచు) సరియే. (అని సాత్యకిని జూచి) తమ్ముఁడా, నీవు సైన్యముల యొద్దఁ గాచుకొని యుండి నా శంఖధ్వనికై నిరీక్షించు చుండుము. ఇంతలో బలరామన్నయ్య కూడ నీయొద్దకు వచ్చును.

బల—(తూర్పు వైపుఁ జూచి, శ్రీకృష్ణునితో) అదిగో! లోక బాంధవుఁడగు సూర్యభగవానుఁడు! నేనును సాత్యకితోడ నే వెళ్లెదను. నీవు సిద్ధముగ నుంటివి కదా?

విదూ—(శ్రీకృష్ణునిజూచి) ఏమయ్యా, మీలో మీరే మాట్లాడుకోవడానికి వుంటే మధ్య నన్నెందుకు తీసుకొని వచ్చేరు? నేనింకా దంతధావనమేనా చేసుకోలేదే! మీరందరు భోజనాలకి సిద్ధంగా వుండి ముందుగుండా వెళిపోతే, నేను మీ వెంట వచ్చిన మనిషినని పోల్చుకొని ఎవరు నాకక్కడ ఆమోదించి భోజనం పెడతారు? ఇందుకేనా మా యింట్లో వున్న చల్దన్నమేనా ఇంత తిననివ్వకుండా వచ్చే వరకు పీక పిసికేసి చంపేసేరు?

బల—(నవ్వుకొనుచు) నీవెంట సాత్యకిని పంపించెదను లెమ్ము. (అని సాత్యకిని జూచి) తమ్ముఁడూ, వచ్చినప్పుడు మీ రిరు

వురుఁ గలిసి రండు.

విదూ—(శ్రీకృష్ణుని జూచి) ఏమయ్యా, కృష్ణమూర్తీ, బల రాముఁ డేఁవిటి ఇలా గంటున్నాడు? నాకు సాత్యకికి పడ దన్నమాట నీకు తెలుసును గదా! వాడి కొక వేళ ఆకలి లేదని రాకపోతే మధ్య నేను తిండిలేక మలమల మాడి చావ వలసినదేనా? ఇదేనా పెళ్లికి వచ్చినందుకు లాభం?

సాత్య—(నవ్వుచు) నీతిండి మండ! ఎంతఁ దినెదవో నేను పెట్టించెదను రమ్ము. (అని విదూషకుని చేయిఁ బట్టుకొని లాగును.)

విదూ—(ఊడిగలఁ బడుచు) కృష్ణా, ఏఁవిటీఅల్లర? గంగిరెద్దు నీడ్చుకొని పోతున్నట్లు సాత్యకేఁవిటి ఇలాగీడ్చుకొని పోతు న్నాడు? (అని చేయి విదిలించుకొని) నేను నీవెంట రాన య్యా, నాకా భోజనం అక్కర లేదు.

శ్రీకృ—(విదూషకుని జూచి) పిచ్చి బ్రాహ్మణుఁడా, భ యము లేదు వెళ్లుము. (అని సాత్యకిని జూచి) తమ్ముఁడూ, నింపాదిగఁ దీసికొనివెళ్లి మరల నాయొద్దకుఁ దీసికొనిరమ్ము.

సాత్య—(నవ్వుచు) అలాగే. (అని విదూషకుని జూచి) రండి; వెళ్లివచ్చెదము.

విదూ—(తనలో శ్రీకృష్ణునిజూచి) నీవు వెంటవుంటే మరి భ యం లేదు. తండ్రీ, ఏ నక్షత్రాన పుట్టితివో గాని—, కాని, కాని. ఇప్పుడెందుకు? పెళ్లయిన పిమ్మట చూచు కుంటాను. (అని సాత్యకితో నిష్క్రమించును.)

(అంత సూర్యారావు ప్రవేశించి శ్రీకృష్ణుని జూచి, సంతోష సంభ్రమములతోఁ దనలో)

సూ—ఓహో! ఏమి ఈ దివ్యమంగళ విగ్రహ సౌభాగ్యము!

చ॥ సకల చరాచర ప్రకర • సంగతికై భువనంబు లోలి సా।
త్త్విక గుణ సంపదన్ హృదయ • వీథిఁ దలంచి స్మరించి,
పెంపఁగా। సకలముఁ దానయై, వెలికి • సర్వముఁ దానది
కానిమాడ్కిఁ దా। నొకరికిఁ గల్గుచున్ బ్రకృతి • నొంచి
వెలింగెడు తండ్రిఁ గాంచితిన్!

ఇంక నా యదృష్టమునకు మేర లేదుకదా! (అని శ్రీకృష్ణుని జేరి చేతులు జోడించుకొని)

ఉ॥ ఏ మహనీయ తేజమున • ఈ సచరాచర జంతుకోటి బ్ర।
హ్మామర సిద్ధ కింపురుష • యక్ష గణంబులకై సమృద్ధిక్కి,
ని। ష్కామిత సంగతిన్ సుకృత • కర్మముఁ గల్గిన వెల్గ
నుండునో। ఆ మహనీయ తేజము కృ • తార్థునిగా నను
బ్రోచుఁ గావుతన్!

(అని శ్రీకృష్ణునికి నమస్కరించును.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు సూర్యారావును జూచి) తమ
బోటి మహనీయులు అభిమానముచే నన్నిట్లు స్తుతించెదరే
కాని ఇందు నావలనఁ గలిగిన విశేష మేమున్నది? ఇంత
కును మీయట్టి భగవద్భక్తుల సంతోషమే నాచే నట్టి కా
ర్యములు చేయించు చున్నది.

సూ—(చేతులు జోడించుకొని) దేవా,

సీ॥ అఖిలాండకోటి బ్ర • హ్మాండ నాయకుఁడవు
ఆది మధ్యాంత స • ద్వ్యాపకుఁడవు,
పంచభూత స్వరూ • పము లందు తండ్రివి,
జీవకోటిని వెల్గు • జీవుఁడవును,
రక్షింప శిక్షింప • దక్షుండ వగుదువు
కుక్షి నజాండముల్ • గూర్చు మతివి,
నీకంటె నన్య మే • లోకంబునను లేదు
ఎందు నీవన్యమై • యుందు వెపుడు!

గీ॥ లోక నాయక, సాత్త్విక • శ్రీకరాత్మ,
భక్తజనపాల, సంతత • పారిజాత,
నిన్ను నుతియింపఁ గలనె దు • ష్కృతి నగుట
పాహి యదువంశ చంద్రమా, • పాహి పాహి.

శ్రీకృ:—(చిఱు నవ్వు నవ్వుచు) దీనికంతకును దమ సంతోష సౌభాగ్యమే కారణమని తలంచెదను. దీనికేమి గాని; తమ రాకకుఁ గారణ మేదియో సెలవిప్పించిన సంతసించెదను.

సూ:—(చేతులు జోడించుకొని) దేవా, లోకరక్షకుఁడవగు నీ పాద దర్శనము చేతనే సమస్త ఐశ్వర్యములు సంప్రాప్త మగుటకు నుండ నా రాకకు వేరెట్టి కారణ ముండును? అయినను, దీనుఁడనగు నాకొక్క వరముమాత్రము దయ చేయించ వలెనని ప్రార్థించెదను.

శా॥ లోకా లోకము లేలు తండ్రివి; జగ • ద్రూపుండవై వె
ల్గుచున్! శ్రీ కాంతామణి రుక్మిణీ సతిగ జ • న్మింపంగ,
భూభార మ! స్తోక ప్రాభవలీల మాన్పుటకునై దోతెంచు

టన్ లక్ష్మితో। నా కంటన్ మరి యొక్క సారిc బడు
కృ ♦ ష్ణా, దేవకీ నందనా.

శ్రీకృ—(చిఱునవ్వు మొగమున సూర్యారావు భుజముపైc
జేతితోc దట్టుచు) తప్పక పునర్దర్శన మగుc గాక! నేనింక
సెలవుc దీసికొనియెదనా?

సూ—(సంతోష పారవశ్యములతోc జేతులు జోడించు కొని)
తండ్రీ, జగన్మోహన కరమగు నీ పాద సౌభాగ్యమును వ
దలి వెళ్లుటకు నాకు కాళ్లు రాకున్నవి కదా యేమి చేయు
దును?

మ॥ మరువై, ముద్దుల మూటయై, సకల స ♦ మ్మోదాంత
రంగంబునై,। స్థిరమై, సర్వ సుపర్వ కోటి కిరవై, ♦ శ్రీ
యుక్తమై, దివ్యమై। వరలన్ గల్గు భవత్పదాబ్జముల సౌ
♦ భాగ్యంబునున్ వీడి, దు। ర్భర సంసారమునందుc జిక్కు
టకు నా ♦ పాదంబు లల్లాడవే!

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు, సూర్యారావు భుజముపైc
జేయివైచి) మీవలె నాకును మిమ్ము విడిచిపెట్టి పోవుటకు
నా హృదయ మొప్పకున్నది! కాని, కొన్ని కారణాంతరము
లుండుటచేc బ్రస్తుతము మిమ్ము విడచిపెట్టి పునర్దర్శనము
నకై ఆసించెదను.

సూ—మహాప్రసాదము. (అని శ్రీకృష్ణ బలరాములకు నమ
స్కరించి నిష్క్రమించును.)

శ్రీకృ—(బలరాముని జూచి) అన్నయ్యా, లగ్నము వేళ కా
వచ్చుచున్నది. రుక్మిణి ఈసరికి గౌరీదేవి ఆలయము వద్దకు

వచ్చియుండు ననుకొనియెదను. మీరింక నా వెంట రాక సైన్యముల యొద్దఁ గాచుకొని యుండుఁడు. నేను వెళ్లెదను.

బల—మంచిది. (అని యొకతట్టునుండి నిష్క్రమింప, శ్రీకృష్ణుడింకొక వైపునుండి నిష్క్రమించును.)

(యవనిక జారును)

—••❀••—

పంచమాంకము—ద్వితీయరంగము

స్థలము—గౌరీదేవి ఆలయము

(నోపుదారులు ద్వారమునొద్దఁ గాచుకొనియుండ, రుక్మిణీ ప్రేమలతలు చెఱియొక వైపు నిలిచి చేతులు జోడించుకొన, గౌరీదేవికి పూజఁజేసి గంటవాయించుచుఁ బురోహితుఁడు హారతి నిచ్చుచుండ తెర లేచును.)

పురో—(హారతిఁ దెచ్చి రుక్మిణీ ప్రేమలతల కందించును.)

రుక్మి—(హారతిఁ బుచ్చుకొనిన పిదపఁ జేతులు జోడించుకొని, తనలో) అమ్మా, ఈశ్వరీ,

(అనుబంధము 7)

చ॥ చినతనమాది నీ భజనఁ • జేయుచుఁ దల్లివి, తండ్రి వీవె
యం। చనుకొని దేవకీసుతుని • స్వాంతమునన్ వరియించి
యమ్మహా। త్ముని ననుఁ గూర్తు వంచు నతి • మోదము
తోఁడను నిల్చియుండుటల్। జనని, యెఱుంగు దీవు కద •
రక్షణ మాకిఁకయ సేయవే దయన్.

చ॥ బలిమిని నన్నుఁ బట్టి శిశు • పాలుని కియ్యెడఁ గట్టి పెట్టఁ గా,॥ దలచిరి తల్లిదండ్రు లిది • ధర్మము కాదను వారు లేరు; ఏ॥ యలవున నన్నుఁ బ్రోచెదో కృ • పాకరి, శాంభవి, లోకమాత, నా॥ కెలమి సమస్త మీ వగుట • యే యవమానముఁ బొంద కుండఁగన్.

(అని సాగిలి నమస్కరించి లేచి నిలుచుండును.)

పురో—(దేవికి పూజఁ జేసిన పుష్పములలో రుక్మిణి కొకటి యిచ్చును.)

రుక్మి—(పుష్పమందుకొని, కనుల కద్దుకొని, తలలోఁ బెట్టుకొనును.)

ప్రేమ—(పురోహితుఁ డుంచిన నైవేద్యముఁ గల పళ్లెరమును బట్టుకొని రుక్మిణినిజూచి చిఱునవ్వునవ్వుచు నిలుచుండును.)

పురో—(రుక్మిణిని జూచి) అమ్మా, వేళ కావచ్చు చున్నది. మనమింకఁ గోటలోనికిఁ బోవుదమా?

రుక్మి—(చిఱునవ్వు నవ్వుకొనుచుఁ దనలో) పాప మీతని కేమియుఁ దెలియకపోవుటచేఁ "గోటలోనికిఁ బోవుట" మను చున్నాఁడు. (అని ప్రకాశముగా) చిత్తము.

పురో—(చోపుదారులకు ముందు నడువ నాజ్ఞాపించి, రుక్మిణీ ప్రేమలతలు వెంటరా నిష్క్రమించును.)

(యవనిక జారును)



స్థలము—పురవీధి

(నలుగురు రాజులు ప్రవేశించెదరు)

మొ॥రా॥—(రెండవ రాజును జూచి,) నిజముగ శిశుపాలుఁడే అదృష్టవంతుఁడు!

రెం॥రా॥—(మొదటి రాజుతో) అదృష్ట వంతుఁడని మెల్లగా అనుచుంటిరేమి? లోక పరాక్రమ శాలియగు జరాసంధు నంతటి వాఁడు వానికి సహాయుఁడై యుండ, అదృష్టమన వానిదికాక మరెవరిది కాఁగలదు?

మూ॥రా॥—(రెండవ రాజునుజూచి నవ్వుచు,) సహాయమును గూర్చియు, అసహాయమును గూర్చియు వారు చెప్పుచుండుట లేదు. జగన్మోహినియగు రుక్మిణీదేవి భార్యగాదొరకినందు కతఁడు అదృష్టవంతుఁడని జెప్పుచుంటిరి.

నా॥రా॥—(మూఁడవ రాజుతో) ఆ విషయమై ఇప్పుడేమియు మనము నిశ్చయించుకొనఁ గూడదని నాయభిప్రాయము.

మొ॥రా॥—(నాలుగవ రాజునుజూచి) ఏమట్లు చెప్పుచుంటిరి? రుక్మిణిని శిశుపాలునికిఁ గాక, మరెవరికిచ్చి పెండ్లిఁ జేయుదురు?

రెం॥రా॥—(మొదటి రాజును జూచి) ఎవరికనిన నేమి చెప్పఁగలము? ఆమె మనస్సు శిశుపాలుని యందు లేదు. శ్రీకృష్ణుఁడామెను, ఆమె శ్రీకృష్ణుని వరింప నిశ్చయించుకొని యుండిరి. పై సంగతు లెట్లుండునో చెప్పఁజాలము.

మూ॥ రా॥—(రెండవ రాజుతో) అందుకొరకే కాఁబోలు శ్రీ కృష్ణుఁ డన్ని సైన్యములను వెంటఁ బెట్టుకొని వచ్చెను!

రెం॥ రా॥—(మూఁడవ రాజుతో) మీఁదు పిచ్చి. జరాసంధు నెదుట ఆ శ్రీకృష్ణుని సైన్యము లెందుకుఁ బనికివచ్చును?

నా॥ రా॥—(రెండవ రాజుతో) ఏమో! మనమిప్పుడేమి చెప్పఁ గలము? అతఁడు పరాక్రమ స్వరూపుఁడు. ఇతఁడు భగవ త్స్వరూపుఁడు. ఎవరిందు నెగ్గఁ గలరో!

(అంత శ్రీకృష్ణుఁడు ప్రవేశింప, రాజు లందఱును లేచి అతనికి నమస్కరింతురు.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు వారందఱికిని బ్రతినమస్కా రములు చేయుచు ఆసనముపై వారలతోఁ గూర్చుండును)

రా॥ అందఱు॥—(ఒకరి మొగ మొకరు చూచుకొనుచు ఊర కుండి యుందురు.)

శ్రీకృ—(తనలో) ఏమిది! రుక్మిణి యింకను రాకుండుటకుఁ గారణ మేమై యుండునో కదా!

(అనుబంధము 8)

(అంతఁ దెరలో "అమ్మా, ఇటు, ఇటు."

మొ॥ రా॥—(విని, తక్కిన వారితో) గౌరీదేవి ఆలయము నుండి రుక్మిణీదేవి వచ్చుచున్నట్లున్నది.

రా॥ అందఱు॥—(రుక్మిణి తమ్ముఁ జూచుటకై ఠీవిగా బట్టలు సర్దు కొని కూర్చుండి యుందురు.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుకొనుచుఁ గొంచెము ముందుకు లేచివచ్చి తనలో)

ఉ॥ ఏ రతనంపు బొమ్మకయి • యీ శిశుపాలుని ద్రోసిపుచ్చి
దు। ర్వార మహోగ్రులై వెసలు • వైరుల నెల్లరఁ గూల్ప
నెంచితో। యారగా, సత్యశీల, సుగు • ణాన్విత వచ్చెడు,
దానిఁ గొంచు నే। ద్వారకఁ జేరువాఁడ వసు • ధా వరు
లెల్లరుఁ గాంచు చుండఁగన్.

(అంతఁ జోపుదారులు ముందు నడచుచుండఁ, పేరిమలతా పురోహితుల వెంట రుక్మిణి ప్రవేశించి శ్రీకృష్ణునిఁ జూచి లజ్జా సంతోషములు ముప్పిరిఁగొన మొగము వంచుకొని మెల్లగ నడచు చుండును.)

రా॥ఖాండేలు॥—(రుక్మిణీ దేవిని ఒంచి, యామె సౌందర్యమున కచ్చెరువందుచుఁ జేష్టలుడిగి, యుందురు.)

శ్రీకృ—(రుక్మిణినిజూచి చిఱునవ్వు నవ్వుకొనుచు ఆమె సౌందర్యమునకుఁ దనలో) ఓహో! ఏమి ఈ జగన్మోహనాకారము! (అని కోపముతో మీఁదికిఁ జూచి తనలో) ఓరీ, జరాసంధ హతకా,

ఉ॥ ప్రాకట శౌర్య సాహస ప • రాక్రమ సింహమవేని నీవు,
నేఁ। జేకొని పోవు చున్న సర • సీరుహ లోచన, రుక్మిణీ
సతిన్। నీ కృప నిల్పు చైద్యునకు • నిచ్చి వివాహముఁ
జేయ రమ్ము; ని। భీకర సత్వ మిందుఁ గని • శింపఁగఁ
జేయుము సంతసించెదన్.

(అని రుక్మిణీదేవి తప్ప తక్కిన ఆమె వారందఱు నిష్క్రమించు టవేః తడవుగ నామె యొద్దకు వెళ్లి చిఱునవ్వు నవ్వ కొనుచు ఆమెను కౌఁగలించుకొని శంఖమును బూరించుచు ఆమెతో రెండవ తట్టునుండి నిష్క్రమించును.)

రా॥అందఱు॥—(శంఖధ్వనికిఁ దుల్లిపడి తెలివొంది నలువైపు లకు ఆశ్చర్యముతోఁ జూచుచుందురు.)

(తెరలో) ఓహో! శూరాగ్రేసరులగు యోధవరులారా!

ఉ॥ నల్లని వాఁడొకండు లల ♦ నామణి రుక్మిణి దేవిఁ గొంచుఁ
దా। నుల్లమునందు భీతిలక ♦ నొక్కట నేగుచు, నున్న
వాఁడు; మీ। రెల్లఱు నింకఁ జూచెద ర ♦ దేటికి? వేగము
వానిఁ బట్టి, యు। త్ఫుల్ల దళాక్షినిన్ విడచి ♦ పుచ్చిన
యట్లొనరింపఁ బూనరే!

రా॥అందఱు॥—(విని ఆశ్చర్యముతో నిష్క్రమించెదరు)
(తెరలో) ఓరోరి యాదవకుల బడబానలమా! చోరాగ్రేసర చక్రవర్తి! ఎందుఁ బోయెదవురా?

చ॥ తులువ తనంబుఁ బూని యటు ♦ తొయ్యలిఁ బట్టి పరా
క్రమించితే। ఖలుఁడ, యదేటి సాహసము? ♦ కాండ
సముజ్జ్వల వహ్ని నిల్పి, నిన్। మలమల మాడ్చి వైచెదను;
♦ నన్నెదిరింపుము పోకు పోకు, నీ। బలమిదె రుక్మి చూచు
టకు ♦ వచ్చుచు నుండెను నిల్వు దుర్మతీ!

(మరలఁ దెరలో)

ఉ॥ ఓ యదు వీరు లార, జ్వలి ♦ తోగ్ర పరాక్రమ సింహు
లార, మీ। ధీయుత యుద్ధ నైపుణముఁ ♦ దెల్లముఁ జేసి
విరోధి సైన్యముల్। మాయఁగఁ జేయరే; దనుజ ♦ మర్ద
నుఁ డల్లదె చైద్య మాగధుల్। గూయిడఁ దోలు చుండె
శర ♦ లోకమునన్ జయమహాను నింకపై.

(అంత శ్రీకృష్ణుఁడు మరల శంఖమును బూరించు కొనుచు రుక్మిణీ సహితుఁడై ప్రవేశించును)

(తెరలో) ఓరోరి యాదవకుల భీరువా, ఎచ్చటను గాన రాకుంటి వేమిరా?

శా॥ ఓరీ, భీరువ, పారుఁగోత, కలుషా ♦ యో ద్రోహి, యీ
పాటి నీ। శూరత్వంబున కిల్లు త్రుళ్లి చలమున్ ♦ జూపించి
తే నిన్ను మ। ద్ఘోరాస్త్రంబులఁ దుంప నే నొకఁడ నీ ♦
కున్ బ్రక్క బల్లెంబునై। ఈ రాజన్యుల మధ్య నుంటివని
నీ ♦ వెంచంగ లేవైతిరా?

శ్రీకృ—(విని) ప్రాణేశ్వరీ, ఆ మాటల వైఖరిని బట్టి చూడ అతఁడు మీ యన్నయగు రుక్మియని దోఁచు చున్నది. శిశుపాల జరాసంధులతో నింత వరకును యుద్ధముఁ జేయుచుండు కారణమున మనము వీని కంటికిఁ గనఁబడక పోవుటచేఁ బిరికితనమునఁ బారిపోయితినని భావించుకొని యున్మత్తుని వలెఁ బ్రేలుచు వచ్చుచున్నాఁడు. నీవిచ్చటఁ గొంచెము నిలువుము. వాని మదముఁ గూడ నడంచి వచ్చెదను. (అని ముందుకుఁ గొంచెము నడచుచుండును.)

(అంత రుక్మి రౌద్రముతో ఖడ్గపాణియై ప్రవేశించి శ్రీకృష్ణునిఁ జూడకయే మీఁదికిఁ జూచి)

రుక్మి—ఓరోరి భీరువా, అంతఃపుర ద్రోహీ, ఎందు దాఁగితివిరా?

ఉ॥ వీరుఁడ వేని నీవు పృథి • వీ పతులన్ గదనంబు నందు దో।
స్సార విభూతిఁ జూపి, జయ • సంగతిఁ గాంచెద వంతె
గాని, యో। రోరి దురాత్మ, దొంగవలె • నొక్కట దాఁగి
మదీయ సోదరిన్। గోరికఁ గొంచు నేగద వె? • న్యాయము
లేదె, నృపాల కాధమా!

అయినను, ఎంతకాలమట్లు దాఁగి యుండెదవో నేనును గొంచె
ము చూచెదను గాక! భూమ్యాకాశములు తలక్రిందైనను ఈ
రుక్మి నీపాలిటి "మృత్యుదేవత" యని ముమ్మాటికిని నమ్ముము.
(అని నలువైపులను దిలకించుటలో శ్రీకృష్ణుని జూచి, మండి
పడుచు) ఓరీ! దురాత్మా! ఇక్కడఁటరా దాఁగి యుంటివి!

శా॥ ఇంకన్ నన్నెదిరించి నిన్ మనుప బ్రీ • ష్మేంద్రాదులున్
జాల రే। బింకం బెంతగఁ జూపెదో తులువ, లో, • వే
గంబు నిన్ బట్టి, నీ। పొంకం బార్చెద, నాల కాపరిపీ; నీ
• వున్ రాజవే? శౌర్య సా। హంకారంబిటు జూప వచ్చితె
దు • రాత్మా, నిన్నుఁ బోనిత్తురా!

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు) బావా, నిష్కారణము ప్రా
ణములపై నాసవదలి నిలవకుము. అదిగో నీ సోదరి. ముం
దామెతోఁ గొంచెము ముచ్చటించి పిదప నీ యిష్టము

వచ్చినట్లు మాటలాడుము.

రుక్మి—(రౌద్రముతోఁ బండ్లు పటపటఁ గొరుకుచు) ఛీ! దురాత్మా! నోరు మూయుము. అధిక ప్రసంగము లాడిన నరికివైచెదను.

ఉ॥ ఆలముఁ గోరి నిల్వ వరు • షార్థము, సిగ్గొక యింత లేక, వా। చాలతఁ జూపుచుంటివి విటు • శౌర్యముఁ జూపుము, చూపకున్న; నా। భీల శరాగ్ని హేతి రుచి • వేఁల్మిడి నీ శిర మిప్డె త్రుంచెదన్। జాలము కోర్చి నిల్చుటకు • నా మన మోర్వదు సుమ్ము దుర్మతీ!

శ్రీకృ—(నవ్వుచు) నా మాట వినుము. తొందర పడిన లాభము లేదు. నిష్కారణముగ నీ సోదరి విచారింప వలసి వచ్చునని చూచుచుంటిని సుమా!

రుక్మి—ఓరీ, వాచాటా, ని మొగముఁ జూచిన కొలఁది నిన్ను నరికివైచుటకు నా హృదయము తొందరఁ బెట్టుచున్నది! ఇదిగో యొక మాట వినుము. యుద్ధమునకు వచ్చెదవా? లేక, నరికివైవ మనెదవా? (అని కత్తిని ఎత్తును.)

(అనుబంధము 9)

రుక్మిణి—(భయముతోఁ గొంచెము ముందునకు వచ్చి, జాలి కలుగునట్లు రుక్మిఁ జూచి) అన్నయ్యా,

ఉ॥ నా నిజనాథు బాహు, కుజ • నమ్ములు గేలి నొనర్చ, నీచుఁ డున్। మానిత కర్మ బాహ్యుఁడును • నై వెలుఁగొందెదు

చైద్యు కీయఁగా। బూనిన నెట్టులోర్తు; నను ♦ ముందు వధింపుము కోపమున్న, నీ। వే, నను రట్టుఁ జేయ నవివేకులు సేయ రె చెప్పు సోదరా?

రుక్మి—(కోపముతో) ఛీ! చండాలినీ! నీవే యింతకును మూలకారకు రాలవు! కావున, ముందు నిన్ను నరికివైచెదను. (అని కత్తిని ఎత్తి రుక్మిణిని నరుకఁ బోవును.)

శ్రీకృ—(కోపముతో రుక్మి కడ్డుగ నిలచి, వానితోఁ గత్తి యుద్ధమునకుఁ దలపడి యుద్ధముఁ జేయుచుఁ గొంత సేపటికి వానిని గ్రిందికిఁ బడవైచి, యొక చేతితో వానిని నొక్కిపెట్టి, రెండవ చేతితోఁ గత్తిని ఎత్తి) ఓరీ, నీచా,

ఉ॥ పెండ్లికి వెంతొ సాహసము ♦ "వీరుఁడ నే" నని గర్వమేదిరా?। ఆలరి నేమొ? నీదు వసు ♦ ధాధిపసత్త్వముఁ జూపుమింక! నా। పెండ్లికి నీవు కాదు, నృపని ♦ వీస్తలి లేదు; ఘరా సుతాదులున్। గాలికి బుద్ధిఁ జెప్పుకొనఁ ♦ గల్గిరె, నీగతి యేమి చెప్పుమా?

(అని నరకఁ బోవును.)

రుక్మి—(శ్రీకృష్ణుని చేయి నతనికి జాలి కలుగునట్లుగఁ బట్టుకొని) ప్రాణేశ్వరా,

చ॥ తెలివి యొకింత లేక, మిముఁ ♦ దెంపరియై కడు నొవ్వనాడుటన్। దలఁ దెగనేయఁ బూనుటలు ♦ ధర్మమె కాని, మహాత్మ, యట్టులన్। సలిపిన భాగ్యవంతులము ♦ నౌదు

మె? ఈశ్వరుఁ డల్లుఁడయ్యెనం! చలరేఁచు తల్లిఁ దండ్రులు
మ ♦ హార్తి మునింగెద రాటఁ బోవ్రుమ్మా!

(అనుబంధము 10)

శ్రీకృ—(ఎత్తిన కత్తిని దింపి, చిఱునవ్వు నవ్వుచు, రుక్మి చేతులు రెండును బంధించి, యతనిని జూచి) బావా, ఇంతకును నీ సోదరి ప్రార్థన వలన నీ ప్రాణములు నిలుప వలసి వచ్చెను గాని, లేకున్నచో; ఈపాటికే యమ సదనమున కతిథివై చని యుందువు సుమా! (అని తెర వైపుఁ జూచి,) ఓరీ, ఎవరచ్చట?

(అంత సాత్యకి ప్రవేశించి)

సాత్య—(శ్రీకృష్ణుని జూచి) ఏమి సెలవు? (అని రుక్మినిఁ జూచి ఆశ్చర్యము నభినయించుచు) ఓహూ! బావ గారా! ఏమిటీ వేషము? (అని అతఁడు బంధింపఁబడి యుండుటఁ జూచి చిఱునవ్వు నవ్వుచు నతనిని జూచుచుండును.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు, సాత్యకిని జూచి) బావగారికీ వేషము బాగుగ లేదు. సగము క్షౌరముఁ జేయించి చూచిన్నచో నింతకన్న నెక్కుడు బాగుగఁ గనఁబడుదురు కావున, నటులఁ జేయించి చూడుము.

సాత్య—(చిఱునవ్వుతో రుక్మిఁ జూచి) రండి బావగారూ, సెలవుఁ దీసికొని పోవుదము. (అని వానితో నిష్క్రమించును.)

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు రుక్మిణీదేవిని జూచును.)

రుక్మి—(సిగ్గుచేఁ దల వంచుకొని యూరకుండును.)

(అంత బలరాముఁడు ప్రవేశించి శ్రీకృష్ణుని జూచి)

బల—తమ్ముఁడా, శత్రువు లెల్లఱుఁ బారి పోయిరి. కావున, మనమింక ద్వారకానగరమునకుఁ బోవుదమా? (అని రుక్మిణీదేవిని జూచి, ఆమె మొగము చిన్నవోవుట కాశ్చర్యము నొందుచుఁ గృష్ణుని జూచి) రుక్మిణి మొగము చిన్నపోయి యుండుటకుఁ గారణ మేమి?

శ్రీకృ—(నవ్వుచు) వేరేమియును లేదు. మా రుక్మిబావగారికి సగము క్షౌరముఁ జేయించి చూచినచో నెక్కుడు బాగుగఁ గనఁబడుదురు కావున, నటులఁ జేయించి చూడవలసినదని యతనిని మన సాత్యకికి వప్పఁజెప్పి వందుల కట్లు సిగ్గుఁ బడుచున్నది.

బల—(కోపముతో) నీకును మతి పోవుచున్నది సుమా! శూరునకు తల గొరుగుట తల నరుకుట కన్న యెక్కువ. చాలుఁ జాలు! మంచి పనిఁ జేసితివి! (అని రుక్మిణిని జూచి,) అమ్మా, రుక్మిణీ,

గీ॥ ఏరి కైనను కర్మ యా ♦ ధార మగుట
నను భవింపక తప్పదు ♦ గనుక నీవు
మనమునను సోదరుని భంగ ♦ మును దలంచి
వగవఁ బోకమ్మ, రుక్మి పై ♦ వాఁడె మాకు?

కావున ఇఁక ముందు నీయట్టి యాఁడుబిడ్డ లిట్టి చింతలఁ బడకుండు నట్లు భగవంతుని బ్రార్థించెదను. (అని మీఁదికిఁ జూచి) ఓ దయామయా,

చ॥ ధరణి సమస్త మానవులు ♦ ధర్మముఁ దప్పక, సత్యసంధులై। వరలుచుఁ గన్నబిడ్డలను ♦ వారు తలంచిన భర్తలన్

మనో॥ హారముగఁ గూర్చి పెండ్లి ముద ♦ మారఁగఁ జే
తురు గాక! ఇంకపై॥ చిరముగ వెల్గుఁగాక జగ ♦ తీస్థలి
నీ కృతి పెంపుఁ గాంచుచున్!

శ్రీకృ—(చిఱునవ్వు నవ్వుచు) తథాస్తు.

బల—తమ్ముఁడూ, మన యాదవ వీరులు నాకై వేచి యుందు
రు. నీవు ముందుగ రుక్మిణీ సహితుఁడవై ద్వారక కేగుము.
నేనును నీ వెనువెంటనే సైన్యములతో నక్రూర సాత్యకుల
వెంట నిడుకొని వచ్చెదను. (అని నిష్క్రమించును.)

శ్రీకృ—(చిఱునవ్వునవ్వుచు రుక్మిణి భుజముపైఁ జేయివైచి)
ప్రాణేశ్వరీ, మనమింక ద్వారకా నగరమునకుఁ బోవుదము
రమ్ము. (అని యామె చేయిఁ బట్టుకొని, రుక్మిణి సిగ్గుచేఁ
జిఱునవ్వు నవ్వుకొనుచు వెంట రా నిష్క్రమించును.

(యవనిక జారును)

ఇది శ్రీసీతా రామచంద్ర చరణారవింద సేవా సమా సాదిత
సరససాహిత్య కవిత్వ వైభవ పరాశరసగోత్రోద్భవ గన్న
వరపు వంశాంభోధి పవిత్రచంద్ర వేంకటేశ్వర పౌత్ర,
నారసింహేశ్వర పుత్ర, సూరమాంబా గర్భశుక్తి
ముక్తాఫల సూర్యనారాయణ మూర్తి ప్రణీతం
బైన "రుక్మిణీపరిణయ" మను నాటక రా
జమున పంచమాంకము సమాప్తము.

శ్రీ శీతా రామచంద్ర పరబ్రహ్మార్పణ మస్తు.



# అనుబంధములు

(ఈపాట నాంది ప్రారంభమునఁ దెరలోఁ బాడుకొనవలెను.)

(అనుబంధము 1) కల్యాణి—ఏకతాళము.

(శ్రీ కర కరుణా కర, శ్రితజన అను కీర్తి)

శ్రీ, రుక్మి, ణీమ, నో, హరా, త్రిభువన పరి పాలా, శ్రితకర, ద్వారకవాసా ॥శ్రీ॥ మురహర హర హర, కరుణా భరణా,। కరివరదా, భవ హరణా, తరణా,। శరణు శరణు మందర వరగిరిధర,। పరమపురుష, మముఁ బాలింపుమురా ॥శ్రీ॥ శ్రీధర, మాధవ, గోవింద, గోపాల, గోవర్ధ నోద్ధార, పాలింపుమూ। హే జగదేక లోకపాలకా, కంసాంతక, శంఖ చక్రధరా,। మురహర, హరహర, (అను చరణము) ॥శ్రీ॥

(ఈ పాట 8 వ పేజీలో రుక్మి నిష్క్రమించిన తరువాత భీష్మకుఁడు "అన్నా! గట్టిచిక్కు వచ్చినదే!" అనుచోట—

(అనుబంధము 2) సింధుర—రూపకము.

(ఏ తీరున నినుఁ బాయఁగలము అను కీర్తి)

ఏగతి హా! విధి! యేమిసేతు నిఁక! ఎటుల నొనర్చిన ఏమగునో కద! ॥ఏ॥ ఏగతి సుత సంతాపముఁ జూచెద!। ఎటు వలెఁ గొమరుని బాసి చరించెద!। ఇటు గన నూయియు, అటు గోయియునై। తటపటమును నన్ గటకట! చేసెడు! ॥ఏ॥ సుతకై చూచిన సుతుఁడలుగును నిటు। సుతునకుఁ జూచిన సుత యేమగునో!। గతి నాకెదియో గత కృతమున దు। ష్కృత మెట్టిది నేఁ జేసితినో! ॥ఏ॥

(అనుబంధము 3) కేదారగౌళ—రూపకము.

(నా హృదయ పలకమున అను రీతి)

ఎంత మాట వింటి రుక్మి! ఇంతి నన్నుఁ బాపి చైద్యు నకును! ఈయ నెంచెఁగా ॥ఎం॥ దంతిగమన చెంతలేక! తాళఁ గలనె చూడఁగా। ఈ క్షణమె పోయి కాంతఁ దెత్తుగా ॥ఎం॥ ఎవ్వ రడ్డు పడెదు వారొ। పువ్వు బోణి నావఁగా। ఆహా! నా ప్రాణ ధనముఁ బాప నెంచెఁగా ॥ఎం॥ లోక మంత ఒకటి యైనఁ। దుర్గంతుఁ గాని విడువఁగా। నాకుఁ గాక చెలియ బ్రతుక దింక నిజముగా ॥ఎం॥

(అనుబంధము 4) కల్యాణి—రూపకము.

(ఏమీ యద్భుతము ఈశ్వరుని మాయా అను రీతి)

ఎంతో యద్భుతము! ఈ ద్వారకా నగర సోయగ ॥మెం॥ ఎంతఁ జూచు చున్నఁ దనివి! సుంత యైనఁ దీర కుండె! ఎంత పుణ్య మతినొ రమా। కాంతూ నివాస మూను గంటి ॥ఎం॥ వేల కొలఁది ఏండ్లుఁ దపముఁ! బోలఁ జేయు మునుల కైన! జేర రాని శ్రీని వాసుఁ! జేరి మాట లాడ నుంటి ॥ఎం॥ కను లు మెరువుఁ గొలుపు సౌధ! మణుల మణుల హృదయ జగము! మోద వీచి కలను వ్రెల్లి! విరియఁ గొలుపు చుండె నాహా! ॥ఎం॥

(అనుబంధము 5) కన్నడదర్బారు—రూపకము.

(హా! రాఘువా! నన్ను బాయ అను రీతి)

హా! నాథా! నన్ను బాయ నెంతువా! ॥హా॥
నీవు లేని ప్రాణ మేల?! జీవితేశ, నీకు మేల?! ఈవిధి కేఁకఁ దాళఁ జాల! బ్రోవ నీకు దానఁ గాన? ॥హా॥

ఈ వియోగ మెటు సైతును?। ఏవిధి నీకే బ్రతుకఁ గలను?।
శ్రీవర, నినుఁ గాక నొరుల। భావ మందు నెంచఁ గలన?
ఇదికదా। యదను నా। హృదయ నా। యక, ననున్। గనుట।
కగుట। దయఁగనుమ। క్షణము జాగు సేయకన్। దీ, ను, రా,
లన్। భరింప। నాలసింప। నన్ను బ్రోవుమా। మనోహరా! ॥హా॥

(అనుబంధము 6) యమునాకళ్యాణి—ఆదితాళము.

(నా మదిఁ గలయ, కోరిక దాపన్ అను రీతి)

జాగిటు సేయ। సత్యమె చెపుమా। సరగున రావా।
శరి వరదా! ॥జా॥ ఏగతి జీవము। తెలమి భరించెద। ఈయెడ
నను విడ। న్యాయమె దేవా? ॥జా॥

లోక-జాలములు అడ్డు వచ్చినను శిశు పాలునకు నన్నొ
సఁగక మానరఁట। ఈదేహము నీకుఁగాకను, అన్యులకు
వశమ్మౌనె అంటఁగా! జీవితేశ్వరా, ఎంచి చూడుమా!
నీకై నిల్చితి। శ్రీకర,నమ్ముమ! చేకొనకున్నన్। జీవములొల్లన్॥

(అనుబంధము 7) సింధుర—ఆదితాళము.

(పరమ పావనుని గుణ నిధానా, అను రీతి)

అంబా, పరమ పావనీ, జననీ,। లోక పాలనీ, భవ
తరణీ, ॥అం॥ దిక్కు నీవె కద దీన జనావని,। త్రిభువన పో
షిణీ, ఆర్త సంరక్షిణీ,। కరుణన్। బరమా। దరణన్। గను
మా ॥అం॥ శరణని నీదగు మరుగుఁ జేరితిని। కరుణఁ జూచి
నను శౌరిఁ గూర్పు మికఁ। నడిపీ। ధిని నన్। నిలుపన్। దగు
నా? ॥అం॥ పుట్టుఁడు లోకముల మూలమూర్తివని మోదంబు
న నే నిల్చితి నన్। గనుమా కరుణన్। బరమా దరణన్ ॥అం॥

(అనుబంధము 8) మోహన—ఆదితాళము.
(పోమె నయ్యో! ఇప్పుడు నన్ను బాసి అను రీతి)

ఔరా! ఎంత విచిత్రముగ నుండె! ॥ఔ॥
ఏరీతి నున్నన్, నా హృదయ మేమో। ఆ రుక్మిణీ సతిన్, బాయంగఁ జాలదు। ఆరమణిరూపమే, అంతటన్ గననయె ॥ఔ॥
ఎంతని తాళుదు! కాంత బాగు సేయు నేమొ! బాగుసేయఁ బూన సంతాపము! ॥ఔ॥ చెలియ చిలుక పలుకులె చిత్రంబులై యొప్ప। కలికిరూపంబు జగమంత యనుగప్ప। ఏరీతిఁ దాళెద నాలేమఁగానక। ఇంకెంతపట్టునో! ఎందాక నిల్తునో! ॥ఔ॥

---

(అనుబంధము 9) మోహన—రూపకతాళము.
(తగునా యిది జనకా, అను రీతి)
ఈ పాట రుక్మిణి, "నా నిజ నాథు బాపి" అను పద్యము చోటఁ బాడుకొన వలెను.

సోదర, యిది తగునా? భేదబుద్ధినను వీధిఁ బెట్టుటలు ॥సో॥ నాదు స్వామిఁ డనుచు లోక। నాథుఁ గోరి యుండు నన్ను। భేద భావమున నధమాధమునకు మీరొసఁగా। ఏది తెరవు నా గతి యేమగునో। తెలుపుడు మీరే బాగా। సదయుల కిది తగునటె నిజ సోదరి నిటు చూడ? ॥సో॥ ధర్మమౌనె యిటులఁ బలుక జగదీశ్వరునకును?। ద్వారక నిలయుఁడు శ్రీపతి! తాకెద విటు తెలియకను। శౌరితోఁడ శౌర్యమేల?, పోరినేలఁ గూలనేల। శ్రీరమణుని నెడఁజేసిన, జీవములను బూనఁ జాల ॥సో॥

---

ఈ పాట రుక్మిణీదేవి "తెలివి యొకింత లేక, మిముఁ దెంపరినై" అను పద్యము చోటఁ బాడుకొనవలెను.

(అనుబంధము 10) మోహన—ఏకతాళము

(సరసిజ దళాక్ష శౌరీ అను రీతి)

మనవిని వినుమా నాథా! మనకిది యగుఁ గాదా యపవాద! ॥మ॥ తప్పిద మగునని। ధర్మము కాదని। తెలుపుట కాదవా। దగుఁ గాదా? ॥మ॥ పగఁగొని గూల్చిన। భాగ్యము కల్గునె?। భవహర, వాదగుఁగా। ననుకొనఁగా ॥మ ॥తనయుని కిఁకమా। జననీజనకులు। నన్నయముఁ జింతిలఁగా। నగుఁగాదా ॥మ॥

---

# ఇందుమతీ విక్రమసేనము.

ఇదియొక క్రొత్త మార్గమున వ్రాసిన ఐదంకముల నాటకము. షేక్స్పియర్ మహాకవి రచించిన ఒథెల్లో (Othello) అను విషాదాంత నాటకమునకు (Lamb) లాంబుగారు వ్రాసిన కథాసారము నాధారముగాఁ జేసికొని కొన్ని మార్పులతో శృంగార, కరుణ, క్రోధరస భూయిష్టమై, చదువువారల కపరిమిత ఆహ్లాదకరమగునట్లు మ॥ రా॥రా॥ గన్నవరపు సూర్యనారాయణ మూర్తి కవిగారిచే రచింపఁబడి రెండవ కూర్పున నున్నది. వెల రు 0—14—0 లు మాత్రమే.

సెక్రెటరీ,

ఆంధ్రభారతీ గ్రంథాలయము,

బరంపురం, (గంజాం జిల్లా)



సీ॥ కేతకి వాసనల్ • ప్రీతిఁ గొల్పఁగ నింపి,
జీర్ణశక్తిని గలుగఁ • జేయు నెద్ది?
ఖారామసాలవి • ఖ్యాతిఁ జూపుచు, దంత
ములకుఁ బటుత్వంబుఁ • నిలుపు నెద్ది?
జామి సద్గుణముల • సౌఖ్యంబుఁ గను నట్లు
రుచిగూర్చు సౌఖ్యంపుఁ • బ్రచుర మెద్ది?
కృష్ణమూర్తి సుబుద్ధ • గెల్పు లక్ష్మికి నాట
పట్టామ వెలుఁగొంద • వరలె నెద్ది?
గీ॥ బ్రహ్మపురము న దన సాటి • వచ్చు నట్టి
లెట్టి ముక్కంటులకు రాని • యట్టు లెలమి
తాంబుపేడు ను రిజిస్టరీ • నెంబరు గను
గనెను గంజాము జిల్లా ప్రి • కాశ మొంద!

---

## మోహినీ వసంతము

ఇదియొక శృంగార రస ప్రధానమైన నాటకము. ఇందలి కథ షేక్స్పియర్ మహాకవి రచించిన "సింబలైన్" అను నాటకము ననుసరించి ముద్దులు మూటఁగట్టు పద్యములతో, మనోహారముగ నుండునట్లు మ॥ రా॥ రా॥ గన్నవరపు సూర్యనారాయణ మూర్తి కవిగారిచే రచింపఁబడి రెండవ కూర్పున నున్నది. వెల రు 0—12—0 లు మాత్రమే.

సెక్రిటరి, ఆంధ్రభారతీ గ్రంథాలయము, బరంపురం, (గంజాం)



నేను చాల కాలమునుండియు చక్రిపాన, ఇమిటేషన్ కమాలములు, వైక్రాంతములు, పుష్యరాగములు మొదలయిన వాటితో మేలయిన పనితరముగా దుద్దులు, జిగినీలు, ఉంగరములు, ముక్కుపుడకలు మొదలగు వస్తువులు అతి స్వల్పధరలకు నమ్మకముగా పూచీపైని తయారుచేసి యిచ్చుచున్నాము. అదిగాక, బంగారుగాజులు పలురకములలో మేలయిన పనితరముగా పొళ్లతోను, సాదాగాను, లతలు మొదలగు నగిషీలతో మనోహరముగ తయారుచేసి పూచీపైని యిచ్చుచున్నాము. ఏ వస్తువు కావలెనన్నను నమ్మకముపైని కోరినప్రకారము స్వల్ప మజూరీలకు తయారుచేసి యిచ్చెదము. మచ్చునకొకసారి మా వస్తువులను పరీక్షించుటకు ఆర్డరొసగిన మా వస్తువుల నాణ్యము తమకే బోధపడగలదు.

ఇట్లు-బుధజన విధేయుడు,

**కదంబ వెంకటేశం ఆచారి**

బరంపుర, భాపురం, గోలీలవీధి, (గంజాం జిల్లా.)

---

☞ వెలస్వల్పము!    గమనింపుడు!    ఫలమధికము

**శ్రీనివాసలేహ్యము:**— దీనియందు 64 మూలికలు ప్రవాళ, రజిత, వంగ, అభ్రక, నాగభస్మములు, మోమ్మాయి, సాలామిశ్రి రత్నపురుష మొదలగు ధాతువృద్ధికరమగు వస్తువులు చేరియున్నవి. సకలవిధ వాతములు, భయంకరమగు దెబ్బలచే శరీరము వజ్జించిన పురాతన నొప్పులు, దీని సేవించిన మాయమగును. మలబద్ధము అజీర్ణము, కాళ్లు నడుముపీకు పోగొట్టి జీర్ణశక్తి కలుగజేసి కాలోచిత విరేచనము ధారాళముగా జేయును చిరకాల మేహమును, పచ్చ, తెలుపు ఎరుపు సెగలు, ఇంకను తదితరమైనసుఖవ్యాధులచే పీడింపబడుచుండువారు దీని సేవనవలన తప్పక రోగవిముక్తులయి శరీరపటుత్వమును కలిగి ధాతువృద్ధియు శరీర తేజస్సును బొంది సుఖింతురు. స్త్రీలు సహితము సేవించిన ఋతుశూల వంధ్యాదోషములు తొలగి సంతానవతులగుదురు. అనేకులు సేవించి దీనిగుణమమూల్యమని వ్రాయుచున్నారు.

☞ దీనిని దేనితోను ఉపయోగింతురో మాకు ఉత్తరిమ్ము లేఖలో తెలియజేసిన సేవించు అనుపానమును వి.పి పార్సిలులో పంపుదుము.

పూటకు ½ తు॥ చొ॥ 20 దినములకగు డబ్బా రు **2.**

**వేణీవసంత:**-కురులు పెరియుట, పట్టతల వురిడిపోటు, దృష్టిమాంద్యము, ఉన్మాదము పోగొట్టుటలో దీనికిదియే సాటి. మెదడునకు చలువజేసి కురులు పట్టునవలె మృదువుగనుండి మేధాశక్తి నివృద్ధి జేయును, బొగడ, సంపెగ, మల్లి, మొగలి మొదలగు పుష్పవాసనలతో శాస్త్రోక్తముగ తయారగుచున్న ఘనతైలము వారివారలిష్టమగు వాసనలదెల్పుచు వ్రాసిన పంపగలము. వెల సీసా **0-12-0**

## సిద్ధామృత ప్రభ

ఈ సీసాను మీవద్దనుంచిన సకలరోగములకు పిడుగై కాచియుండును, ఎట్టి కష్టమగు బాధలయినను లోపలికి సేవించుటవలన గాని పైకి వ్రాయుట వలన గాని క్షణమాత్రమున మాయముజేయు మహౌషధి.

లోనికి సేవించిన ప్రాణాపాయకరములగు కలరా, కడుపునొప్పి కఠినములగు సకల శూలలు, అకస్మాత్తుగా వచ్చు శ్వాస విరామములేక వచ్చు ఎక్కిళ్లు, భరించరాని దగ్గు, పేగులు పెల్లవించు వమనము, అజీర్ణ విరేచన

ములు, రక్త విరేచనము మొదలగు వ్యాధులు నివారణమగును. పైవాని యందు చేతను తలపోటు, చెవిపోటు, వాతనొప్పులు, కీళ్ళనొప్పులు, రక్తస్రావము చెవియందు ఝూంకరించుట, పండ్లనొప్పి, మూలవ్యాధిచే ఆసనమునగల నొప్పి గొంతు నొప్పి, మూత్రముబంధించుట, తేలు మొదలగు విషజంతువుల కాటులకును యీ మొదలగు బాధలను రెండునిముషములలో నివారించును.

వెల పెద్దసీసా 12 అణాలు చిన్నసీసా 6 అణాలు మాత్రమే.

## 8 మోతాదులు జ్వరటాదర్వ, సీసా రు 0—12—0

24 గంటలలో సకలవిధ నూతన పురాతన సంక్రామిక మాలేరియా, చలి, పాలి, కదుపు, విషమ, జ్వరముల 3 మోతా॥ అద్భుతముగామాన్పును.

ఇయ్యాది జ్వరము పట్టియున్నను విడిచి వచ్చుచున్నను 1 దినములో జ్వరమును రానీయక 2 దినములలో అరుచి, మలబద్ధము, శరీరభారము, తల నొప్పి, మొదలగు లక్షణముల హరించును 1 సీసాపూర్తిగా వుపయోగించు సరికి జ్వరములకుగల ఇతర లక్షణముల హరించును. చాలకాలమునుండి జ్వర ము తగిలిప్లీహ (ప్లీనా) యకృతు (లీవరు) పెరిగియున్నను 2, 3, సీసాలు వుపయోగించిన ఆరోగ్యము కల్గించును.

## అమృత కలాంజనము సీసా 0—6—0

భరించరాని తలనొప్పి భాధను 2 నిముషములో తొలిగించి శిరోభాగ ముత్గ్గించును. రొంత, కపాలపోటు ముక్కుమండుట మొదలగు బాధలు సులభముగా పోగొట్టును. తేలు మొదలగు విషజంతువులు కరచిన దీనిని ఆ చోట రాసిన తప్పక నివారణ మగును,

**దద్రునాశని:—** గజ్జి, తామర, చిడుము, ఏనుగుతామర ఈ మొదలగు వ్యాధులు రక్తముచెడి క్రిములచే కలిగి దినదిన ప్రవర్ధమాన మగును. వీటిపై మాదద్రునాశని పిడుగువంటిది. 3 సారులు రాసిన వుప్పివలె వ్రాలి చర్మమునకు శుభ్రపరచి తేజస్సు నిచ్చును. వెల డబ్బీ 0—3—0

## శ్రీ జ్ఞానప్రకాశక వైద్యశాల,

విక్టోరియా మార్కెట్టు రోడ్డు బరంపురం, గంజాం.

## విజ్ఞాపనము.

# సుబుద్ధి కేతికీ ఖారా మసాలా

(రిజస్టర్డు)

వెల స్వల్పము! ఫల మధికము!!

### ఒక్క పర్యాయము పరిశీలించి చూడుడు!

ఈ ఖారా మసాలా చేసులేని విలువగల పొగాకుతోను, లవంగాలు, యాలకులు, దాల్చిని, మొదలగు సువాసిత జీర్ణకారకములగు పదార్థములతోను తయారు కాబడినది. ఈ మసాలాను తాంబూలముతో ఉపయోగించిన యెడల తాంబూలము సురుచి సంపన్నముగా నుండును నములుచున్నప్పుడు పరిస్ఫుటిత కేతికీ పుష్పము యొక్క సుగంధ సౌరభమును నోటియందు పరిమళింప చేసి, హృదయమునకు ఆనందమిచ్చి, మనస్సును శాంతి పరచును. ఇంతేకాక, భోజనానంతరము ఈ మసాలాను తాంబూలములో వాడుకొనినచో ముఖ దుర్గంధమును తొలగించును. ఈ మసాలా చాలారోజులు ఉంచినను చెడిపోకుండా క్రొత్తగా తయారుచేసిన మాదిరిగ నుండును.

కత్రింపు ఎక్కలమారు విషయమై నొక్కి వక్కాణింప నవసరము లేదుగాని; యితరులు తయారుచేసే మాదిరి నిల్వ, పుచ్చు, కల్తీ లేకుండా మంచి క్రొత్త సరుకే సప్లయి చేయబడును. కేతికీ కాచు వగయిరా కిరాణా సామానులు కూడా వ॥యువారికి సప్లయి చేయబడును.

ఇతరుల మాయోపాయములకు వెరచి నేను ఈ మసాలా పేరు రిజిస్ట్రి చేయించి యున్నాను. వ॥యువారు యీ దిగువ విలాసమునకు ఆర్డరిచ్చినచో పోస్టు, లేక; రయిల్వే పార్సిల్ ద్వారా పంపబడును. అధికముగా కోరువారలకు సాధ్యమగునంత తక్కువ ధరలకు నొసగబడును. సుబుద్ధికేతికీ ఖారా మసాలా 22 తులముల శేరు 1కి రు 0—8—0 లు.

కొంచాడ చిన్న కృష్ణమూర్తి సుబుద్ధి,

బరంపురం, (గంజాం)

వేశ్యా పిటజన వినోదము—ఇది యొక శృంగార రస ప్రధానమైన ప్రబంధము. వెల రు 1—4—0.

ప్రహ్లాద చరిత్రము—ఇదియొక నూతన శైలిని రమ్యముగ నుండు నాటకము. వెల రు 1—0—0.

విమల లత—ఇదియొక నవల. వెల 0—12—0 లు.

రఘురామశతకము—(కందపద్యములు) 2 అణాలు

గౌరీనాధశతకము (కంద పద్యములు) 2 అణాలు.

కంచ కామాక్షమ్మ శతకము (కంద పద్యములు) వెల రు 0—2—0 లు మాత్రమే.

పై గ్రంధములకు గ్రంథకర్త,

కడియం సత్యనారాయణ కవి

రాజాం. (విశాఖపట్నం జిల్లా) ప్రస్తుతం బరంపురం.

---

అశ్వగంధ రసాయనము

ఇది ధాతు దౌర్బల్యమును, పురుషత్వహీనతను పోగొట్టి, బల వీర్య మేధా పుష్టి కారకమై, శుక్రవృద్ధి, జ్ఞాపకశక్తుల నత్యధికముగ కల్పించుటలో సాటిలేనిదై, పోయిన రక్తమును మరల పుట్టించుటకు అమోఘమైన ఔషధము. దీని సేవనవలన స్త్రీలకు గర్భకోశము బాగుగ చేసి, సంతాన వంతులుగా చేయుననుటకు సందియమెంతమాత్రమును లేదు. ఇదియునుగాక నానావిధ వాతవ్యాధులను పోగొట్టి, క్షయను మొదలంట తెగగొట్టును. వెల 20 తులముల డబ్బీ 1కి రు 3—8—0లు.

శ్రీ కవిరాజు వైద్యనాధ శర్మ,

సంజీవినీ ఔషధాలయము, బరంపురం, (గంజాం)

# సీతాపహరణము

గ్రంథకర్త—"వాఁడే వీఁడు" "నేనే" "కాలూ గాయి" అను నపూర్వనిరుపమాన నిరూపక నవలాశిరోమణులు రచించి, మెప్పు వడసిన మ. శ్రీ. దేవరాజు వేంకటకృష్ణారావు పంతులుగారు.

అకళంకంబలె నిర్మలంబగు రామాయణ కథావస్తువునందు తప్పిం తమాషాలు రాఁగలవనుదిగ్భ్రమ యీపుస్తకము చదువునప్పుడు మాచదువరులు తెలిసికొనఁగలరు. చదువనారంభించిన విడువఁజాలరు. సీతారాముల పెండ్లి యైన గడియ సముద్దేశించిన విశ్వామిత్రుని కల్పితయజ్ఞమునకు రావణుఁడు పోరఁగా వచ్చినవాఁడై, సీతాపహరణమునకు వచ్చి, పెద్దారిం గానక, దాశరథివేషమున సీతను గొనిపో నుద్దేశించి, మాయసీతను గాంచి నిజసీతయని భ్రమ చెంది, మోసపోయి, స్వయంకృతాపరాధమునకు చింతించి, నగపాధిప పాతాళ లంకేశ్వరుని సహాయము నభిలషించి, మరల రావణుఁడు చేపట్టిన సీత స్వచక్రి భయమున మాయామనుజుల రావణునికంటె వేయిమడుంగు లధికముగు మోసము చెంది, చింతించి లంకేశ్వర పాతాళలంకేశ్వరుల సంతతులలో సీతాకల్యాణ సమయమున శివధనుర్భంగమున పెనోడ్పి యుపాయములు పన్ని, విఫల మనోరథు లగుటయును, లోనగు భయానక విషయములతో, అసంఖ్యాక రామాయణ పారాంశములతో, అప్పటి ఆర్థిక, భూగోళ, చరిత్రాత్మక విశేషములతో, వివిధరంగులచిత్రపటములతో, నపూర్వమై, నవరసభరితమై అలరారుచున్నది.

వెల రు 1—0—0 మాత్రమే.

డి. వి. కృష్ణారావు,

విలాసము—

వేగుచుక్క ఆఫీసు, బరంపురం, (గంజాం)

